# విస్‌డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక


# ఈ సంచికలో

జనవరి 1990




## సంపాదకవర్గం

సంపాదకుడు.

లయన్ **కె.వి.గోవిందరావు** బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు

**టి.ఎల్.ఎన్.రావు** బి.ఎస్సి.,

**వి.బాలకుమార్** ఎమ్.ఏ.,బి.ఎల్.,

సభ్యులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,

కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,

కె.రత్నకుమారి


## చందా వివరాలు

జీవిత చందా ........ రూ.400/-

3,సంవత్సరాల చందా........ రూ.100/-

సంవత్సర చందా........... రూ.36/-

ఎయిర్ మెయిల్(1సం॥)... రూ.130/-

సీ మెయిల్(1సం॥)......... రూ.75/-

చందాపంపవలసిన చిరునామా

**రత్నా ఏజన్సీస్**

9,దేశికారోడ్,మైలాపూర్,మద్రాస్-600004.

ఫోన్ 73327

ముఖచిత్రం
కలర్ ట్రాన్సుపరెన్సీ
కె.ఆర్.వి.భక్తం

**తెలుగు విస్‌డమ్‌కు ఇది తొమ్మిదవ సంవత్సరం**

# విస్డమ్

## అవార్డుల సభ

1989 డిసెంబరు, 15వ తేది
సాయంత్రం గం 5-30 లకు

**రాణిసీతై హాల్**
మద్రాసు - 600 006

అధ్యక్షులు: శ్రీ సి. సుబ్రహ్మణ్యం
మాజీ కేంద్రమంత్రి

తెలుగు ప్రత్యేక సంచిక ఆవిష్కరణ:
తమిళనాడు హైకోర్టు న్యాయమూర్తి
గౌ॥ ఎస్. రామలింగం

(సలహాసంఘు సభ్యులచే విజేతలకు
'విస్డమ్' అవార్డుల బహూకరణ)

# ధ్యానం

## విజ్ఞానానికి ముందు అనుష్ఠానం


—జేమ్స్ ఎలెన్

పాఠశాలల్లో ఉపాధ్యాయుడు ప్రప్రథమంగా గణితశాస్త్రంలో మిక్కిలి కష్టమైన సూత్రాలను బోధించడు. అటువంటి బోధనావిధానం అసాధ్యం అని అతడికి తెలుసు. చిన్న కూడికనో, తీసి వేతనో ఇచ్చి దానిని వివరించి లెక్కను చేయమంటాడు విద్యార్థి దానిని సక్రమంగా తప్పులేకుండా చేసి చూపించినప్పుడు దానికంటే కొంచెం కష్టమైన లెక్కను ఇస్తాడు. ఈవిధంగా బోధిస్తూ చిట్టచివరకు గణితశాస్త్ర రహస్యాలను బోధిస్తాడు. విద్యార్థి నిశ్చయజ్ఞానం పొందడానికి బుద్ధిని అన్వేషింపజేస్తాడు ఉపాధ్యాయుడు. ఇట్టి అన్వేషణా కార్యక్రమంలో విద్యార్థి బుద్ధి కొన్ని భావాల ద్వారా జ్ఞానాన్ని నిశ్చయం చేసు

(మిగతా 4 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## ఆత్మవిశ్వాసం విజయానికి రాజబాట

ప్రతీరోజూ ప్రతినిత్యం ప్రతిచోటా ఎక్కడ చూసినా చికాకులతో తికమకలు పడిపోతూన్న వారే. పరాజయంతో వరితపించేవారే. ముఖ్యంగా ఆత్మవిశ్వాసం లేకుండా భయంతో తబ్బిబ్బులతో కలవరపడిపోతూంటారు. వాస్తవమైన జీవిత సమస్యలను సక్రమంగా పరిష్కరించుకోడానికి తగినంత మనోనిబ్బరం ఉండదు. అటువంటి వారెప్పుడూ అధైర్యపడిపోయి నిరాశతో నిరీక్షిస్తూంటారు నిరుత్సాహవంతులైన నైరాశ్య జీవులతో ఏ సంస్థా రాణించదు.

పురుషులైనా, స్త్రీలైనా ధైర్యోత్సాహంతో జీవితాన్ని ఎదుర్కొంటూ దీక్షతో ఆసక్తితో జీవించగలగడం నేర్చుకోవాలి ఇటువంటి వారి జీవితాలు దిగ్విజయపూరితాలు. ప్రపంచంలో అనేకమంది తమ జీవితాలలో

**1990 శుభాకాంక్షలు!**

మా పాఠకులకూ, ఏజంట్లకూ, ప్రకటనదారులకూ హార్దికమైన నూతన సంవత్సర శుభాకాంక్షలు.

—సంపాదకుడు

"ఒక ఆలోచన, ఒకమాట, ఒక ఆచరణ అన్నీ విడదీయరాని విధంగా ముడిపడి ఉన్నాయి."

కలిగే ఆటంకాలను, అవరోధాలను ధైర్యంతో ఎదుర్కొంటూ ప్రగతి మార్గంలో గొప్పవారని పించుకున్నారు చేపట్టిన పని హృదయ పూర్వకంగా చేస్తూంటే ఆత్మవికాసం దృఢతరం అవుతుంది. ధైర్యం, ఆశాభావం అలవరచు



కోవాలి. ఆత్మవిశ్వాసం నీలోనుంచే రావాలితప్ప ఇతరులు నీకు కలిగించేదికాదు ఆశాపూరిత మైన ఆలోచనలతో ఆత్మవిశ్వాసం పెంపొందించుకుంటూ జీవించే ఉత్సాహ వంతులకు ప్రపంచం ప్రసాదించని సౌభాగ్యంలేదు.

●

## ఔషధ ప్రపంచం

### జలగ నోటిలో లాలాజలం కాన్సర్ గ్రంథిని విస్తరించు కోనీయదు

దక్షిణ అమెరికాలో జలగనోటి లాలాజలంలో నుంచి తయారుచేసిన ఔషధాన్ని ఊపిరితిత్తుల కాన్సర్‌గల ఎలుకలకు ఇంజక్షను ఇస్తే కాన్సర్ గ్రంథులు విస్తరించుకోలేదని యుఎస్‌ఏ ఫిలడెల్ఫియాలో పెన్సిల్వేనియా హాస్పిటల్‌లో గ్రంథి వైద్య నిపుణుడు గాబ్రియల్ గాసిక్ కనుగొన్నాడు.

### హ్రస్వదృష్టి నివారణకు క్రొత్తవిధానం

కంటి రోగాలకు సంబంధించిన ది మాస్కో హెల్మ్ హోల్ట్స్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో స్క్లీరాను బలిష్ఠం చేసే ఇంజక్షన్‌తో హ్రస్వదృష్టి నివారణకు క్రొత్త విధానం కనిపెట్టబడింది. ఈ క్రొత్త ఇంజక్షను కంటిగ్రుడ్డు వెనుక ఇంజక్ట్ చేస్తే కార్నియా చుట్టూ ఉంటూ స్క్లీరా పొరమీద సంధానం చేసే పొరలు వృద్ధి పొందుతాయి. దీనివల్ల హ్రస్వదృష్టి పెరగదు. ఇది నివారణకన్న నిరోధక చికిత్స అని చెప్పాలి. తక్కువ హ్రస్వదృష్టిదోషం గలవారికి ఇది మహోపకారం చేస్తుంది.

(3 వ పేజీ తరువాయి)

కుంటుంది. ఇట్టి నిశ్చయజ్ఞానాన్ని కలిగించడానికే బుద్ధికి సాధన శ్రమను ఉపాధ్యాయుడు కలిగిస్తాడు. దృశ్యా దృశ్య ప్రపంచాన్ని పర్యాలోచిస్తే ఆత్మ స్వరూప లక్షణాలు అవగతం అవుతాయి. అభ్యాస పూర్వకమైన విద్య ప్రబలినకొద్దీ వెలుగులు ప్రకాశవంతం అవుతాయి.

●

### వాతావరణాన్ని సూచించే కప్ప

ఫ్రాన్స్‌లోని పోర్సెల్ నగరంలో ఉన్న వాతావరణ కేంద్రంలో ఒక కప్ప అక్కడ పనిచేసే శాస్త్రజ్ఞులకు వాతావరణాన్ని గురించి అధునాతన సదుపాయాల కంటే సమర్థవంతంగా ముందుగానే తెలియ జేస్తుంది.

— 'మిసెస్' సౌజన్యంతో

"నీళ్లలోకి దిగందే ఈతరాదు."

# కన్యాకుమారి వైభవం

వి.ఎస్. శ్రీనివాసన్

భారతదేశానికి చిట్టచివర దక్షిణాగ్రము కేప్‌కామొరిన్ దీనినే స్థానికంగా కన్యాకుమారి అంటారు ఇది భారతదేశం భూబాగపు కొస లేక అగ్రము భారతదేశపు పుణ్యక్షేత్రాలలో చిట్టచివరనుండే పుణ్యక్షేత్రం కన్యాకుమారి బంగాళాఖాతము, అరేబియాసముద్రము, హిందూమహాసముద్రము మూడు కలిసే చోటు ఇది ఈ దివ్యక్షేత్రంలో సూర్యోదయం, సూర్యాస్తమయం చూడనివారు ఒక



మహాద్భుత ప్రకృతిదృశ్యాన్ని వదులుకున్న వారవుతారు అంతేగాక ప్రతిసంవత్సరం చైత్రమాసంలో పూర్ణిమనాడు సూర్యాస్తమయం, చంద్రోదయం ఒకే సమయంలో జరగడం మిక్కిలి ఆశ్చర్యకరం హిందువులకిది ఒక గొప్ప పుణ్యక్షేత్రం నాగర్‌కోయిల్‌నుంచి కన్యాకుమారికి బస్ సౌకర్యం ఉంది ఇది కేరళ రాష్ట్రం రాజధాని త్రివేంద్రంకు 77 కి.మీ.ల దూరంలోను, తిరునల్వేలికి కూడా77 కి.మీ.ల దూరంలో ఉంటుంది రైలుప్రయాణం చేసి కూడా కన్యాకుమారి చేరవచ్చు

ప్రపంచంలో ఒక్క కన్యాకుమారిలోనే సూర్యోదయం, సూర్యాస్తమయం ఒకేచోట కూర్చుండి చూడవచ్చు సముద్రానికి ఎదురుగా ఈతకు సౌకర్యంగా స్విమ్మింగ్‌పూల్ నిర్మించ బడింది సముద్ర స్నానమట్టానికి తూర్పు దిక్కుగా వివేకానంద రాక్‌మెమోరియల్ దేవాలయం వివేకానందుల జ్ఞాపకార్థం నిర్మించ బడింది వివేకానందులు కన్యాకుమారికి వచ్చి ధైర్యసాహసాలతో సముద్రంలోకి దుమికి ఈదుకుంటూ అక్కడ ఉన్న గుట్టపైకి వెళ్లి తపస్సు చేశారు అక్కడే వారికి అమితోత్సాహం కలిగి పాశ్చాత్య దేశాలకు వెళ్లాలనే సంకల్పం కలిగింది

## 'విస్డమ్' పాతకాపీలు

*మార్చి '82, జూన్ '82, డిసెంబరు '82, ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84; జనవరి '85, మార్చి '85 నుంచీ ఆగస్టు '85, అక్టోబరు '85; జనవరి '86 నుంచీ డిసెంబరు '86; జనవరి '87 నుంచీ డిసెంబరు '87; జనవరి '88 నుంచీ డిసెంబరు '88; జనవరి '89 నుంచీ జూన్ '89 కాపీలు మావద్ద ఉన్నవి. 1982 కాపీల వెల రూ. 2.50 లు; 1983 కాపీవెల పై. 0.75 లు; 1984 కాపీల వెల రూ.8.75లు; 1985 కాపీల వెల రూ. 10.25 లు; 1986 కాపీల వెల రూ. 18.25 లు; 1987 కాపీల వెల రూ. 19.00 లు, 1988 కాపీలవెల రూ. 20.25 లు; 1989 కాపీల వెల రూ. 12.00; రిజిష్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 5.00 లు చేర్చి M.O పంపాలి— 'రత్నా ఏజెన్సీస్', 9 దేశికారోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.*

—సర్క్యులేషన్ మేనేజర్

"మార్గమేమిటో ఎవరికీ తెలియదు కానీ మనమంతా వివిధ మార్గాలలో పయనిస్తూ సత్యాన్వేషణ కోసం ముందుకెళ్తున్నాం."

తూర్పుతీరంలో కన్యాకుమారికి 4 కి.మీ.ల దూరంలో శీపురం ఒక గొప్ప ఓడరేవు 8 కి.మీ.ల దూరంలో ప్రాచీన కోట ఉన్న 'వట్టకోట్టై' మరో చూడదగిన ప్రదేశం

దేవాలయానికి దగ్గరగా సముద్రపు ఒడ్డున రంగురంగుల ఇసుక కనిపిస్తుంది చిన్న బాలిక వలె కనిపించే భగవతీదేవి లేక కన్యా



కుమారికి సుచీంద్రలో పరమశివుడైన "స్థాను మూర్తికి" వివాహం జరిగి ఉండాలి. కన్యా కుమారికి ఉత్తరదిక్కుగా 11 కి.మీ.ల దూరంలో సుచీంద్రంలో బ్రహ్మ, విష్ణు, శివుడు - త్రిమూర్తులకు అంకితమైన సుప్రసిద్ధ దేవాలయం ఉంది.

వివాహం నిర్ణయింపబడిన దినానికి శివుడు రాలేదు. వివాహ మహోత్సవంలో వినియోగానికి తెచ్చి ఉంచిన బియ్యం మరునాడు రంగురంగుల ఇసుకగా మారిపోయింది. ఆనాటినుంచీ భగవతీదేవి కన్యగానే ఉండిపోయింది.

ఇచ్చటి ఇసుక వివిధ రంగులలో ఉండడానికి కారణం ఇంకా పరిశోధించి తెలుసుకోవలసి ఉంది. గాంధీజీ అస్థికలలో కొన్ని 1948 ఫిబ్రవరి 12 వ తేదీన కన్యాకుమారి వద్ద సముద్రంలో కలపబడ్డాయి దీని జ్ఞాపకార్థం ఇక్కడ తిరువాన్కూర్ కొచ్చిన్ ప్రభుత్వం వారు గాంధీ స్మారకమందిరాన్ని నిర్మించారు ప్రతీ సంవత్సరం అక్టోబరు 2వ తేదీన గాంధీ జయంతినాడు సూర్యుని కిరణాలు గాంధీ స్మారక మందిరంలో వేదికపై ప్రసరించేటట్లు ఈ మందిరం నిర్మించబడింది ఇచ్చట నిర్మింపబడిన మూడు గోపురాలు సత్యం, అహింస, శాంతిని నిరూపిస్తాయి

మహాభారతంలో, ఉపనిషత్తులలో కూడా దీని ప్రసక్తి ఉంది కాబట్టి ఇది అతి ప్రాచీనమైనదనే విషయం నిర్వివాదం

●

## ఉబ్బసానికి ఔషధం

*ఉబ్బసపు దగ్గుకి నివారణ లేదని, అది ఆమరణాంతం బాధిస్తుందని అంటారు. అది నిజం కాదు. దీర్ఘ కాలం నుంచీ పీడిస్తున్న దగ్గుకి, ఉబ్బసానికి అపూర్వమైన నివారక ఔషధం ఉంది. దీనిని ఇంట్లోనే తయారుచేసుకోవచ్చు.*

*ఒక కిలోగ్రాము ఉల్లిపాయలను సన్నగా చక్రాలుగా తరగండి. వీటిని ఒక మట్టికుండలో పెట్టి అందులో 2 కి.గ్రాల పరిశుభ్రమైన వినిగర్ వేయండి. కుండమూతి బట్టతో గట్టిగా కట్టి పైన మట్టిపూత పెట్టండి.*

*ఈ కుండను గాలి తగులకుండా 40 రోజుల పాటు (ఒక మండలం) భూమిలో పాతిపెట్టండి. తరువాత తీసి శుభ్రమైన బట్టతో వడకట్టండి. వడకట్టిన ద్రవానికి రెండురెట్లు పంచదార కలిపి చిన్న మంటమీద పాకం వచ్చేవరకు ఉడకపెట్టండి. గట్టిపాకం వస్తూంటే తీసి సీసాలో పోసి ఉంచండి. దీనిని రోజుకు 10 గ్రాముల చొప్పున తింటే నెలరోజులలో ఆస్త్మా పూర్తిగా తగ్గిపోతుంది.*

— కెవిజె. జి.ఎస్. వర్మ

"పండితుని మేధస్సులో విజ్ఞానం, శాస్త్రం,
మతం తమతమ హద్దులను అతిక్రమించవు."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 భారతదేశపు ఏ రాష్ట్రంలో గుర్తింపబడిన జాతులు (షెడ్యూల్డ్ ట్రైబ్స్) జనాభా అత్యధికం?
(ఎ) బీహార్, (బి) మహారాష్ట్ర, (సి) ఆంధ్ర ప్రదేశ్, (డి) మధ్యప్రదేశ్

2 రాజ్యసభకు ఎన్నికైన సభ్యునియొక్క కాల పరిమితి·
(ఎ) 3 సంవత్సరాలు, (బి) 2 సంవత్సరాలు, (సి) 6 సంవత్సరాలు, (డి) 5 సంవత్సరాలు

3 భారతదేశపు ఏ నగరానికి భూమి అడుగున సొరంగంలో మెట్రోరైల్వే ఉంది?
(ఎ) న్యూఢిల్లీ, (బి) బరోడా, (సి) కాన్పూర్, (డి) కలకత్తా

4. 'డాటర్ ఆఫ్ ది ఈస్ట్' అనే గ్రంథం రచయిత ఎవరు?
(ఎ) బెనజీర్ భుట్టో, (బి) నిరాద్ సి. చౌదరి, (సి) బిమల్ మిత్ర, (డి) రొనాల్డ్ సెగల్

5. 1992 ఒలింపిక్ క్రీడలు ఇచ్చట నిర్వహింపబడతాయి :
(ఎ) బీజింగ్, (బి) లస్బన్, (సి) బార్సిలోనా, (డి) కెయిరో

6 దక్షిణ గంగోత్రి·
(ఎ) ఇండియన్ నేవీ పెట్రోల్ బోటు, (బి) ఆంధ్రప్రదేశ్‌లో నాట్యవిధానం, (సి) అంటార్కిటికాలో భారతదేశపు పర్మనెంట్ సైంటిఫిక్ స్టేషన్, (డి) కర్ణాటకలో ఒకనది.

7 భారతదేశంలో టిన్ లభించే ప్రదేశం·
(ఎ) పన్నా (మధ్యప్రదేశ్), (బి) హజారీబాగ్ (బీహార్), (సి) తిరుచ్చి (తమిళనాడు), (డి) ఆల్వాయి (కేరళ)

8 పచ్చి కూరగాయల్లో ముఖ్యంగా లభించే విటమిను :
(ఎ) విటమిను K, (బి) విటమిను D, (సి) విటమిను C, (డి) విటమిను A.

## తెలివికి పరీక్ష

1. అంకెలస్థానంలో శూన్యస్థానాన్ని తెలిపే వర్తుల రేఖ ఏది?
2. అసంభవమైన దానిని సూచించే కొడుకు ఎవరు?
3. రెండు రెండ్లకు, రెండుసార్లు రెండుకు గల తేడా ఎంత?
4. ఒకే సమాన పరిమాణము, రెక్కల నిడివి

### సంకేతాక్షరాలు

AIWC : ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్
CSI : కంప్యూటర్ సొసైటీ ఆఫ్ ఇండియా
ETT : ఎంబ్రియో ట్రాన్స్‌ఫర్ టెక్నాలజీ
LRT : లైట్ రైల్ ట్రాన్సిట్

"సమకాలీన విజ్ఞానశాస్త్రం సత్యాలు సదా మారుతూ ఉండే అవధులు లేని సముద్రం."

గల రెండు వాయువిమానాలు తీక్షణంగా ఎండ కాసే ఒకరోజున ఒక మైదానంపైన ప్రయాణం చేస్తున్నాయి మొదటిది భూమికి 500 అడుగుల ఎత్తున, రెండవది 50 అడుగుల ఎత్తున ఉన్నాయి అయినా వీటి నీడలు ఎంతమాత్రం తేడా లేకుండా ఒకే పరిమాణంలో ఉన్నాయి ఎందుచేత ?

5 క్రింది వాక్యంలో తప్పు సరిద్ది వ్రాయుము పార్లమెంటులో జరిగిన చర్చలో పదిమంది సభ్యులు, నాలుగు పార్టీలు పాల్గొన్నాయి

6 క్రింద సూచించిన భజన గోష్ఠులలో ప్రసిద్ధ మైన జనరంజక కీర్తన మొదటి పాదంలో చెదిరిపోయిన అక్షరాలు అర్థవంతంగా వ్రాయండి

త్రతాకరము మందొరికోనరికెను

## మాటల మహిమ

1 మనసు చిత్తము (ఎ), అనురాగము (బి), కోర్కె (సి), అభిప్రాయము (డి)

2 మాలిమి ఎక్కువ పరిచయము (ఎ), వాత్సల్యము (బి), శూన్యమగు (సి), ఓర్పు (డి)

3 లెస్స క్షేమము (ఎ), మేలు (బి), శ్రేష్ఠము (సి), సులభము (డి)

4 మాట వాక్యము (ఎ), లోకోక్తి (బి), హితోక్తి (సి), నిందావాక్యము (డి)

5 సరకు: సామగ్రి (ఎ), సొమ్ము (బి), లక్ష్యము (సి), స్వర్గము (డి)

6 సుగుడి సరసుడు (ఎ), గుణవంతుడు (బి), సుబోధము (సి), నీతిబాహ్యుడు (డి)

7 సోకు తాకు (ఎ), ఆవేశించు (బి), చొచ్చు (సి), కష్టము (డి)

8 శ్రీ ధనము (ఎ), గొప్పహోదా (బి), సాలెపురుగు (సి), గౌరవసూచకంగానూ, శుభసూచకంగానూ వాడే పదము (డి)

(జవాబులకు వ పేజీ చూడండి)

## ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో 30 మిలియను వాహనాలు

*ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ ఆటోమొబైల్ ఇండస్ట్రీ అసోసియేషన్ సభ్యులు 1988 లో మొత్తం 40,000 మందిని నియోగించి డిఎమ్ 180 బిలియను విలువచేసే 4.8 మిలియను ప్రైవేటు కార్లను కాంబిన్ మరియు వ్యాపార వాహనాలను ఉత్పత్తి చేసారు. డిఎమ్ 100 బిలియనుకు పైబడిన విలువగల వాహనాలను ఎగుమతి చేసారు.*

*ప్రపంచంలో తిరుగుతూన్న ప్రతీ 10వ ప్రైవేటుకారు పశ్చిమ జర్మనీవారు తయారు చేసినదే జర్మనీలో గల 27 మిలియన్ కర్మాగారాలలో ప్రతీ 7వది కారు పరిశ్రమకు సంబంధించినదే. ప్రస్తుతం ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ రోడ్లమీద 30 మిలియను వాహనాలు తిరుగుతున్నాయి. ఇవేగాక ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ మీదుగా వెళ్ళే విదేశీయుల కార్లు మిలియనుల కొద్దీ ఉంటాయి.*

*జర్మనీలో కారు పనివాళ్ళ జీతం గంటకి 36 87 డి.ఎమ్. ఇది ప్రపంచంలో అన్ని దేశాలలో కంటే చాలా అధికం. ఇటలీ, స్పెయిన్, జపాను, కొరియా దేశాలలో కంటే కూడా మిక్కిలి అధికం.*

*భవిష్యత్తులో రాబోయే కార్లు 'ఇంటలిజెంట్ కార్లు'. ఇవి నియమించిన సక్రమ మార్గంలో నడుస్తూ ముందుపోతూన్న కారుకి అపాయం ఏర్పడనంత ఎడంలో కంప్యూటర్ సహాయంతో నడుస్తాయి. ఈ కార్లు ముందుండే ఆటంకాలను, అవరోధాలను తగినంత ముందుగానే తెలియజేస్తుంది కంప్యూటరు*

*— 'జర్మన్ ఫీచర్స్' సౌజన్యంతో*

"లోకులు నమ్మినా నమ్మకపోయినా
వాస్తవంలో కవి వాక్యం నిజమే అవుతుంది."

# ఆస్ట్రియా సంగ్రహ చరిత్ర

తీరప్రదేశం లేకుండా నాలుగు ప్రక్కలా భూభాగం ఆవరించుకున్న దక్షిణ మధ్య యూరప్ ప్రదేశమే ఆస్ట్రియా. తూర్పు ఆల్ప్స్ మరియు డాన్యూబ్ బేసిన్‌లో కొంత ఇందులో చేరి ఉంటాయి. దేశం 65 శాతంపైగా పర్వతమయమై ఉంటుంది. దీని వైశాల్యం 83,853 చ.కి.మీ (32,376 చ.మైళ్లు). జనాభా 75,00,000 పైబడి




ఉంటుంది. దీనికి ది ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ, జెకోస్లోవేకియా, హంగేరీ, యుగోస్లేవియా, ఇటలీ, స్విట్జర్లాండ్ మరియు లీక్‌టెన్‌స్టీన్ అనే ఏడు దేశాలతో ఉమ్మడి సరిహద్దులు ఉన్నాయి.

ఆస్ట్రియా ఫెడరల్ రిపబ్లిక్‌లో 9 ఫెడరల్ రాష్ట్రాలు ఉన్నాయి. వియన్నా ఫెడరల్ రాజధాని. దక్షిణ మరియు తూర్పు దిక్కుగా కొన్ని చిన్న స్లావ్ (Slav) మైనారిటీలు ఉన్నా ఆస్ట్రియాలో 99 శాతం జనాభా జర్మన్ భాషనే మాట్లాడు కుంటారు. జనాభాలో 10కి 9 వంతులు రోమన్ కాథలిక్కు మతానికి చెందినవారు.

ఆస్ట్రియా ఆల్ప్స్ పర్వత ప్రదేశాలతో పెద్ద పెద్ద మైదానాలతో ప్రకృతి రమణీయంగా ఉంటుంది. ఇచ్చటి గ్రాస్ గ్లోక్నెర్ (12,416 అ.) మిక్కిలి ఎత్తైన పర్వత శిఖరము, డాన్యూబ్ మిక్కిలి పెద్ద నది. ఈ నది 200 మైళ్ల పొడవు ఆస్ట్రియాలో ప్రవహిస్తుంది. సంవత్సరం పొడవునా వర్షపాతంతో ఉష్ణోగ్రత +35-°C మరియు −13° C(వియన్నాలో) మధ్య ఉంటుంది.

ఆస్ట్రియాలో ప్రజాపాలిత పార్లమెంటు ఉంది. ఫెడరల్ ప్రెసిడెంట్ రాజ్యానికి సర్వాధి కారి. అధ్యక్షుడు ఆరు సంవత్సరాల కొకసారి ప్రజలచే ఎన్నుకోబడతాడు ఫెడరల్ ఛాన్సలర్ ప్రభుత్వాధికారి పార్లమెంట్

## తమిళ సినీ ప్రపంచం

తమిళనాడులో తీసిన మొట్టమొదటి చిత్రం: శ్రీనివాస కళ్యాణం - 1934
లండన్‌లో మొట్టమొదటి షూటింగ్: నవయువన్ - 1937
మొట్టమొదటి 3D చిత్రం: అన్నైభూమి - 1985
మొట్టమొదటి జాతీయబహుమానం పొందిన నటుడు: ఎమ్.జి. రామచంద్రన్ (ఎమ్.జి.ఆర్) రిక్షాకారన్ (1971)
పాటలు లేకుండా తీసిన మొదటి చిత్రం: అందనాళ్ (శివాజీ గణేశన్)
మొట్టమొదటి మహిళా సౌండ్ ఇంజనీరు: శ్రీమతి నారాయణన్ - 1934

"తొందరపడకుండా నేర్పుగా జీవితాలు కొనసాగించే వారికి అన్నీ విజయాలే ఎదురవుతాయి."

నేషనల్ రాట్ లేక లోయర్ హౌస్, బుండెస్ రాట్ లేక అప్పర్ హౌస్ అని రెండు భాగాలుగా ఉంటుంది. నేషనల్ రాట్ సభ్యులు రహస్య వోటు విధానంలో నేరుగా నాలుగు సంవత్సరాలకొకసారి ఎన్నుకోబడతారు.

ఆస్ట్రియా ఫెడరల్ స్టేట్‌లోగల 9 పెద్ద రాజ్యాలకు విడివిడిగా ప్రత్యేకమైన రాజ్య పాలనా విధానం ఉంది. 9 ఫెడరల్ రాజ్యాలు బుండెస్‌రాట్‌కి మొత్తం 58 ప్రతినిధులను పంపుతారు. ఆస్ట్రియా అలీన రాజ్య పాలనా విధానానికి కట్టుబడి ఉంది. కాబట్టే ఇక్కడ


Mr. KURT WALDHEIM (PRESIDENT OF AUSTRIA)

ఆరుమాసాల పాటు బుండెషీర్ అని చెప్పబడె ఫెడరల్ సైన్యంలో నిర్బంధ సైనిక విధానం అమలులో ఉంది.

ఆస్ట్రియా ఆధునిక రాజ్యానికి 18వ శతాబ్దంలో మేరియా థెరీసా మరియు ఆమె కుమారుడు 2వ జోసెఫ్ పునాదులు వేశారు. 1867 నుంచి ఆస్ట్రో-హంగేరీ అని చెప్పబడే ఈ రాజ్యం 1918 లో పతనమైంది. 1938లో ఆస్ట్రియాపై హిట్లర్ నిరంకుశాధిపత్యం వహించాడు 1945లో రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఆస్ట్రియాను నాలుగు మిత్ర రాజ్యాలు ఆక్రమించాయి. 1955లో సంధి జరిగేవరకు దానికి రాజ్యాధికారం ఏర్పడలేదు. తరువాత ఆస్ట్రియా తటస్థ విధానాన్ని బహిరంగంగా ప్రకటించింది

ఆస్ట్రియాలో వ్యవసాయ కార్యక్రమాలు పూర్తిగా మెషీన్లు సహాయంతో కొనసాగుతాయి


ST. STEPHEN'S CATHEDRAL VIENNA

దేశానికి అవసరమైన ఆహారధాన్యాలు 85 శాతం దేశంలో పండించబడతాయి. అడవులలో పైన్ చెట్ల కలప ముఖ్యమైన ఎగుమతి.

ఆస్ట్రియా దేశపు పారిశ్రామిక రంగంలో ప్లానింగ్, డెలివరీ, ఫాక్టరీల సంస్థాపన పూర్తిగా జరుగుతాయి. ఆస్ట్రియాలో వృద్ధిపొందిన LD విధానంలో ఉక్కు ఉత్పాదన విధానం నేడు ప్రపంచం అంతటా ఉపయోగిస్తున్నారు

జలవిద్యుత్ ఉత్పాదన మరియు ఎగుమతికి ఇక్కడ పర్వతాలు సహకరిస్తున్నాయి. చేతితో తయారైన అనేక రకాల వస్తువులు, దుస్తులు, ఆభరణాలకు ఆస్ట్రియా మిక్కిలి ప్రసిద్ధిపొందింది.

"ఏ పూవులో ఏ పరిమళముంటుందో అవి విరబూసిన తరువాతగానీ తెలియదు."

ఆస్ట్రియాలో స్కిల్లింగ్ (Schilling) చలామణిలో ఉంది. ఇదే ప్రపంచంలో మిక్కిలి స్థిరమైనది. మార్పుకోడానికి వీలైనది.

1973 నుంచి వియన్నా దగ్గర ఉన్న లాక్సెన్ బర్గ్ కాసిల్‌లో ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అప్లైడ్ సిస్టమ్స్ ఎనాలసిస్ ప్రసిద్ధి పొందింది. ఇక్కడ ప్రపంచంలో గల వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు అందరూ తమ తమ భావి అభివృద్ధి కార్యక్రమాలను క్రమబద్ధం చేసుకుంటారు.


International Institute of Applied Systems Analysis – Vienna

వియన్నాలో సిగ్మండ్ ఫ్రాయిడ్ మనస్తత్వ శాస్త్రాన్ని అభివృద్ధి చేసాడు. జోసెఫ్ రసెల్ సుప్రసిద్ధ నవ్యకల్పనా చతురుడు, ఆస్ట్రియా దేశస్థుడు. ఇతడు మెరైన్ స్క్రూను కనిపెట్టాడు. విక్టర్ కాప్లాన్, కాప్లాన్ టర్బైన్‌ను కనిపెట్టిన మరో ప్రతిభావంతుడు.

ఆస్ట్రియా వాఙ్మయం తొమ్మిది శతాబ్దాల నాటిది. సమకాలీన రచయితలలో హెచ్.సి. ఆర్ట్‌మాన్, వుల్ఫ్‌గాంగ్ బావెర్ థామస్ బెర్న్‌హార్డ్ మరియు పీటర్ హాండ్కెక్ ప్రపంచ ప్రసిద్ధిని పొందిన గొప్ప రచయితలు. హెయ్‌డెన్ మొజార్ట్, బీతోవెన్, ఇంకా అనేక ఉత్తమ వాగ్గేయ కారులకిది పుట్టినిల్లు

ఆస్ట్రియాలో ఉచితంగా విద్య నేర్పబడుతుంది. ఆస్ట్రియాలో 18 యూనివర్సిటీలు ఉన్నాయి. వియన్నా యూనివర్సిటీ 1365లో స్థాపించబడింది. ఇంటర్నేషనల్ ఎటామిక్ ఎనర్జీ ఏజెన్సీ, ది యునైటెడ్ నేషన్స్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్, ది ఆర్గనైజేషన్ ఆఫ్ పెట్రోలియం ఎక్స్‌పోర్టింగ్ కంట్రీస్ వంటి అనేక అంతర్జాతీయ సంస్థలు ఇక్కడ నెలకొన్నాయి. వియన్నా హాఫ్‌బర్గ్‌లోని ప్రాచీన భవనంలో ఉన్న కాంగ్రెస్ సెంటర్‌లో తరచుగా అంతర్జాతీయ సభలు, సమావేశాలు జరుగుతూంటాయి. డాన్యూబ్ నది తూర్పు తీరంగా మరొక అంతర్జాతీయ సమావేశ కేంద్రం ఏర్పడింది.

## సూచనలు-సంకేతాలు

రెడ్‌క్రాస్: హాస్పిటలు లేక వైద్యసహాయము
రెడ్‌లైట్: అపాయము, ఎమర్జన్సీ లేక రోడ్డు మీద ట్రాఫిక్ ఆగడానికి సూచన.
గ్రీన్ లైట్: లైన్ క్లియర్ సూచన
బ్లాక్ ఆర్మ్ బాండ్: (చేతికి నల్లపట్టీ): అసమ్మతి చిహ్నము లేక సంతాప చిహ్నము
బ్లాక్ ఫ్లాగ్: అసమ్మతి
లోటస్ (తామర): సంస్కృతి మరియు నాగరికతకు సూచన
చక్రం: ప్రగతి
పావురం: శాంతి
కళ్ళకు గంత కట్టిన మహిళ చేతిలో త్రాసు: న్యాయము
ఆలివ్ కొమ్మ: శాంతి
ఎర్ర జెండా: అపాయ సూచన లేక విప్లవము
తెల్లజెండా: సంధి
దించిన పతాకం: జాతీయ సంతాపం
తల్లక్రిందుల పతాకం: అపాయ సూచకము

"స్వార్థపరులు స్వలాభాపేక్షతో సృష్టించిన కొన్ని సూత్రాలు ధర్మశాస్త్రాలుగా చలామణి అవుతున్నాయి."

# మృగరాజు - సింహము

రూపాల్ రావాల్

దట్టమైన అడవులలో నివసించే మృగ రాజు అనబడే సింహం అంటే మానవుడికి కూడా ఎంతో భయం. దీనిని గురించి బైబిల్ లోను, గ్రీకు పౌరాణిక గాథలలోను ప్రస్తావింప బడింది అంటే ఆశ్చర్యపడక్కర్లేదు అశోకుని పరిపాలనా కాలంలో చక్రవర్తి ముద్రలో ఆసియా దేశపు సింహం బొమ్మ ఉపయోగించ బడింది నేడు భారతదేశం జాతీయ



చిహ్నంలో సింహం ఒక భాగంగా విరాజిల్లు తూంది. గుజ రాత్ గిర్ అడవులలో నివసి స్తూన్న ఆసియా సింహమే గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వానికి చిహ్నం.

ఒకప్పుడు ఆఫ్రికా, గ్రీస్, ఇండియా, టర్కీ మరియు ఇరాన్ దేశాలలో విస్తారంగా నివసి స్తూండే సింహం ఈనాడు ఆఫ్రికా, మరియు భారతదేశం గుజరాత్ గిర్ అడవులలో తప్ప ఇతర చోట్ల పూర్తిగా అంతరించిపోయింది అనే చెప్పుకోవాలి. ఇప్పుడు గుజరాత్‌లో 225 మొదలు 250 సింహాలు మాత్రమే కనిపిస్తు న్నాయి. గిర్ అడవులలో గాక ఇతర ప్రదేశా లలో 1884లో చివరిసారి సింహం కనపడింది

ఇది సంఘజీవి ఇవి గుంపులు, గుంపు లుగా సంచరిస్తాయి ఈ గుంపులను 'ప్రైడ్' (Pride) అంటారు ఒక్కొక్క ప్రైడ్‌లో 2 మొదలు 30 మృగాలు ఉంటాయి. సాధారణంగా ఒక్కొ క్క ప్రైడ్‌లో మగసింహాలు, 7 లేక 8 ఆడసింహాలు ఉంటాయి ఈ గుంపులో అనేక సింహంపిల్లలు ఉంటాయి

ప్రైడ్‌లో పెరిగిన మగసింహాలు విడిపోయి ఇతర మగ సింహాలతో చేరతాయి మగసింహాలు ప్రైడ్ సంచరించే ప్రదేశాన్ని సంరక్షించుకుంటాయి అడవిలో చిన్న చిన్న సింహం పిల్లలు విశ్రాంతి తీసుకుంటూన్న తలిదండ్రులను పీడిస్తూ ఆడుకునే ఆట చూడడానికి విచిత్రంగా ఉంటుంది సింహం ఒక్కొక్కసారి 2 మొదలు 5 పిల్లలను ఈను తుంది పుట్టిన వెంటనే ఈ సింహం పిల్లలు పూర్తిగా తల్లి సింహంమీదే ఆధారపడి ఉంటాయి పుట్టిన వెంటనే ఇవి కళ్ళు తెరవవు. కళ్ళుతెరు చుకోడానికి వారం రోజులు పడుతుంది సాధా రణంగా రెండేళ్ళకే వీటికి పిల్లలను పెట్టే యుక్త వయస్సు వస్తుంది అయిదు సంవత్స రాలు వచ్చేటప్పటికి బాగా యౌవ్వనంలో ఉంటాయి.

సింహానికి అందమైన సన్నపాటి శరీర సౌష్ట వం, కండలు తీరి బలిష్టమైన కాళ్ళు, నోటిలో కోరలు, వంపులు తిరిగి ముడుచుకున్న గోళ్ళు, పరిసరానుగుణ్యమైన శరీరవర్ణం మొదలైన వన్నీ పొంచుండి జంతువులను వేటాడి జీవించడానికి అనువుగా కుదిరి ఉన్నాయి. శరీరంపైన ఇసుక రంగుగల బొచ్చు ఎండిపోయిన

"ఆత్మస్థైర్యం లేనివారికి అనుమానాలు మెండు."

గడ్డి మైదానాల రంగులోఉండి వ్యత్యాసం కనిపించదు సూర్యాస్థమానం అయిన తరువాత ఇవి వేటకు బయలుదేరి మెల్లిమెల్లిగా పొంచి ఉండి నడుస్తూ అకస్మాత్తుగా తటాలున పైకి ఎగిరి దుమికి వేటజంతువు మీద పడతాయి.

బ్రహ్మాండమైన బలంతో సింహం దుమికి వేటజంతువు మీదపడి ఎంతపెద్ద జంతువు నైనా వాడియైన గోళ్లతో అదిమిపట్టి గొంతు నొక్కి శ్వాస లేకుండా చేసి చంపేస్తుంది. లేళ్లు, దుప్పులు, కోతులు, పక్షులు, అడవి ఎలుగుబంట్లు, గేదెలు మొదలైన పశువులు వీటికి ముఖ్య ఆహారం. ఒక్క మానవుడు తప్ప దీనిని వేటాడే ఇతర జంతువులు లేవు

సింహాలు గర్జిస్తాయి ఈ గర్జనే గుంపులో ఉన్న ఇతర సింహాలకు పిలుపు జాగ్రత్తగా ఉండమని హెచ్చరిక కూడా ఇవి పరస్పరం సమాచారం తెలియజేసు కోడం చాలా వింతగా ఉంటుంది. మెల్లగా గానీ, బిగ్గరగా గానీ చేసే గర్జనలు, కూతలు అభిమానం, భయం, అపాయం మొదలైన విషయాలు తెలియజే సుకుంటాయి. ఇవి సాధారణంగా గుర్రుమని అరవడం, పిల్లికూతలు వంటి కూతలు, మూలుగులు, పెద్ద పెద్ద అరుపులు మొద లైన వాటితో కూడా పరస్పరం తెలియ జేసు కుంటాయి.

ఆఫ్రికాజాతికి చెందిన ఆసియా దేశపు సింహాలకు శరీరంపైన అధికంగా బొచ్చు ఉంటుంది. వెంట్రుకల కుచ్చుతో కూడిన తోక, ముందుకు బాగా పెరిగిన భుజాలు, ముడత లు పడిన కడుపు, ముఖంపైన జూలు ఉంటుంది ఆసియాజాతి సింహాలు కొంచెం చిన్నవిగా ఉంటాయి. శరీరం రంగు లేతగా ఉంటుంది. రెంటికి కూడా అలవాట్లు సమానంగా ఉంటాయి ప్రక్కన మానవ సంచారం ఉన్నా నిర్భయంగా ఉంటాయి నిర్బంధనంలోకూడా పరిసరాను గుణ్యంగా ప్రవ ర్తిస్తాయి

సింహాలు ముఖ్యంగా వేట జంతువులు. ఈ వేట సింహాలకే గాక అడవులలో జీవా వరణ సమతౌల్యతకు కూడా సహకరిస్తుంది. అందంగా ఠీవిగా ఉండే ఈ సింహాలు లేకపోతే ప్రపంచం శూన్యంగా కనిపిస్తుంది

'సిఇఇ.ఎన్.ఎఫ్ ఎస్ సౌజన్యంతో

## టాంజేనియాలో ఏనుగుల సంఖ్య 55,000 కి తగ్గి పోయింది

*ఎన్విరాన్‌మెంటల్ న్యూస్ డైజెస్టు వారి సమాచారం ప్రకారం ఆఫ్రికా టాంజేనియాలో సీలస్ రిజర్వులో ఏనుగులసంఖ్య 1977 లో ఉన్న 1,10,000 నుంచి 55,000 కి పడిపోయింది. ఈరిజర్వు లలో 11,390 ఏనుగులు వేటగాళ్లచే చంపబడ్డాయి అని ఒక అధ్యయనంలో తేలింది ప్రస్తుతం ప్రతీ సంవత్సరం టాంజేనియాలో ముఖ్యంగా దంతాల కోసం 30,000 ఏనుగులు చంపబడుతున్నాయి.*

*— 'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో*

"మానవీయులైన మహాత్ములు తోటివారిని మాలిన్యంలో పడకుండా పైకి ఎత్తుతారు."

# హృదయాన్ని గురించి తెలుసుకోండి

## హృదయం ప్రతీసారి విశ్రాంతి తీసుకుంటుంది

మానవ హృదయం ప్రతీసారి రక్తాన్ని ఒకసారి ముందుకు పంపుచేసిన తరువాత విశ్రాంతి తీసుకుంటుంది. పెరిగిన ఆడవారి హృదయం 250 గ్రాములు, పెరిగిన పురుషుల హృదయం 310 గ్రాములు తూగుతుంది. సాధారణంగా 80వ సంవత్సరంలో మరణించే వారి జీవితంలో హృదయం మొత్తం 3,363,840,000 సార్లు కొట్టుకుంటుంది



## హృదయం విద్యుత్ స్పందనలను గుర్తించేందుకు సాధనం

1935లో ఫ్రెంచి ఇంజనీర్లు మానవుని హృదయంలో విద్యుత్ స్పందనలను గుర్తించేందుకు ఒక సాధనాన్ని తయారు చేసారు.

## క్షీరదాలకు, పక్షులకు మానవులకు గుండెలో నాలుగు గదులు

క్షీరదాలు, పక్షులు మరియు మానవులకు మాత్రమే హృదయంలో నాలుగు గదులు ఏర్పడి ఉంటాయి. రక్తప్రవాహ కేంద్ర స్థానంలో ఈ హృదయం విస్తృతమైన రక్తనాళాల ద్వారా రక్తాన్ని పంపుచేస్తూంటుంది. చిన్న చిన్న కీటకాలు, చీమలు మొదలైన వాటి హృదయంలో ఒకటి, చేపలకు రెండు, కప్పలకు మూడు గదులు ఉంటాయి.

## ఉద్రేకం తీవ్రమైన హృదయ రోగానికి కారణం

హృదయ రోగాలు చాలామటుకు శరీర సంబంధమైనవైనా ఉద్రేకాలవల్ల తీవ్రమైన హృదయరోగాలు సంభవించగలవని వైద్యులు అంగీకరిస్తున్నారు.

(మిగతా 15 వ పేజీలో)

## ప్రపంచంలో బ్రహ్మాండమైన కంచు విగ్రహం

జపాన్ నారాలో టొడైజీ దేవాలయంలో దయబుట్సు కంచుబుద్ధ విగ్రహం ప్రపంచంలో మిక్కిలి పెద్దది. ఇది 71 అడుగుల ఎత్తుగా ఉండి 551 టన్నులు భారం ఉంటుంది. దీనిని 160 అడుగుల ఎత్తు, 187 అడుగుల పొడవు, 166 అడుగుల వెడల్పు కొలతలు గల ప్రపంచంలోనే మిక్కిలి పెద్ద హాల్‌లో పెట్టారు.

"లేని వస్తువును సంపాదించుకోవడం యోగం,
సంపాదించిన వస్తువును కాపాడుకోవడం క్షేమం"

# ఎంతో పుణ్యవంతురాలు

దైనందిన కార్యక్రమాలను ప్రేమతో చేపట్ట గలిగిన స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. ఆమె మనసారా ఆనందంతో చేసే ప్రతీపనీ దైవాయత్తం అవుతుంది

తనవారిని, పరాయివారిని సరిసమానంగా ఆదరించుకోగలిగిన స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు ఆదరాభిమానాలతో అతిథి సత్కారం ప్రేమాను భూతికి మొదటి మెట్టు.



పిన్నలకు, పెద్దలకు, సమయానుకూలంగా సేవ యొనర్చుగల స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. ఎదుటి వారి అభిప్రాయాన్ని గ్రహించడం మానవీయత

గృహాన్ని శుభ్రంగా ఉంచుకునే స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. పరిశుభ్రత పరమాత్ముని సాన్ని ధ్యాన్ని తెలియజేస్తుంది.

పిల్లలు ఆదరాభిమానాలతో ప్రేమించే స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. తల్లికి సకలసౌభాగ్యాలను మించిన సౌభాగ్యం పిల్లల ప్రేమ

పనిచేసుకుంటూ ఆనందంగా పాడుకునే స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. గానమాధుర్యంలో పని భారం తగ్గిపోతుంది విసుగు అనిపించదు.

అనుమానం, భీతి, భ్రమ లేని స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. ఆత్మవిశ్వాసమే అన్ని కష్టాలను జయిస్తుంది కాబట్టి.

సంతోషంగా చిరునవ్వుతో ఉండే స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. ఆందోళనలేని మనస్సు మానసికంగా శారీరకంగా ఉత్సాహ శక్తిని ప్రవృద్ధి చేస్తుంది.

పవిత్రమైన గృహధర్మాన్ని సుస్థిరంగా నెలకొల్పు గల స్త్రీ ఎంతో పుణ్యవంతురాలు. పవిత్రధర్మం గౌరవప్రతిష్ఠలను పెంచుతుంది.

— 'ఇన్స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

( 14 వ పేజీ తరువాయి)

## గుండెజబ్బుల బాధ తగ్గడానికి క్రొత్త ఔషధం

ఈనాడు అనేక విధాలైన గుండెరోగాలు పూర్తిగా నివారించలేకపోయినా 'ఫాక్స్ గ్లో' అనే మొక్క పువ్వులనుండి తయారయే క్రొత్త ఔషధం గుండె బాధను తగ్గిస్తుంది

## వంశపారంపర్యమే ముఖ్య కారణం

ఆరోగ్యవంతమైన హృదయాలు గల తలిదండ్రులకు పుట్టిన పిల్లల గుండెలు ఆరోగ్యవంతంగా ఉంటాయి. వంశపారంపర్యమే గుండె రోగాలకు ముఖ్య కారణం.

## సగటున మానవ హృదయం నిమిషానికి 72 సార్లు పంపుచేస్తుంది

సగటు మానవుని హృదయం నిమిషానికి 72 సార్లు పంపుచేస్తుంది. ఈ నిమిషంలో మొత్తం మానవ శరీరంలో ఉండే రక్తంలో 90 శాతం దీనిగుండా ప్రవహిస్తుంది.

"జీవి మరణ దుఃఖ ప్రవాహాలనుండి విమోచన మొందడమే మోక్షం."

# మృత్యువును ధైర్యంతో ఎదుర్కోవాలి

స్వామి వివేకానందులు అమెరికాలో పర్యటిస్తూ సనాతన ధర్మం, హైందవ విజ్ఞానం గురించి గంభీరంగా ఉపన్యసించారు బలహీనులకిది మార్గముకాదని మృత్యువును ధైర్యోత్సాహాలతో ఎదుర్కోగల ధీరుడు మరియు పరాక్రమ వంతులకే ఇది సరైన మార్గమని ఉద్బోధించాడు



కొంతమంది సంశయవాదులైన యువకులు స్వామి బోధనలను సందేహించి ఉపన్యాసం ఇమ్మని ఆహ్వానించారు."వాస్తవ జీవితం యొక్క రహస్యం, భగవంతునిపై విశ్వాసం" అనే విషయంపై ఉపన్యసించారు విశ్వాస వంతుడే కష్ట సమయాలలోను, అపాయపరి స్థితులలోను ధైర్యవంతుడని ఉపన్యసించడం ప్రారంభించారు అకస్మాత్తుగా తుపాకీలు ప్రేలటం ప్రారంభమైంది గుండ్లు స్వామి ప్రక్కకు వచ్చి పడుతున్నాయి సభలో అల్లరి ప్రారంభ మైంది అనేకమంది స్త్రీలు భయంతో గజగజ వణికి పోయారు, కొంతమంది స్పృహతప్పి పడిపోయారు జనం నలుదిక్కుల కంగారుగా పరుగెత్తి పోయారు

అట్టి అల్లకల్లోలంలో ధైర్యంగా ఒకే ఒకవ్యక్తి గంభీరంగా, పెద్ద పర్వతంలాగా నిలుచున్నాడు అతడే స్వామి వివేకానందులు భగవదేచ్ఛ లేనప్పుడు ఎన్ని గుండ్లు ప్రేల్చినా స్వామికి తగలదు ఎంతమంది రక్షకులున్నా విది నిర్ణ యించినప్పుడు ఆయనపై ప్రేల్చిన గుండు ఆయనకు తగలక మానదు

తుపాకుల పేలుళ్లు ఆగింది స్వామి తన ఉపన్యాసాన్ని తిరిగి ప్రారంభించారు ఏ అవాంతరం లేకుండా సభ సాగింది శాంతి ఏర్పడింది. ఉపన్యాసం ముగిసింది వెంటనే తుపాకులు పేల్చిన యువకులు స్వామి వివేకానందుని దగ్గరకు వచ్చి 'స్వామీ! మా అపరాధాన్ని క్షమించండి మీరు ఎంత ధైర్యంగా ఉపన్యాసం సాగిస్తారో చూడడానికే మేము తుపాకులు పేల్చాము మీ ధైర్యసాహసాలు, విశ్వాసం మాకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి" అన్నారు స్వామీ వివేకానందులు చిరునవ్వు నవ్వారు

'ఈస్ట్ అండ్ వెస్ట్ సీరీస్' సౌజన్యంతో

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద ఆశ్రమం

ప్రపంచంలో మిక్కిలి పెద్ద ఆశ్రమం డ్రెపుంగ్ (టిబెట్, చైనా)లో ఉంది. ఒకప్పుడిది 10,000 బౌద్ధ భిక్షువులకు ఆశ్రయం ఇచ్చింది వీరికి 25,000 ఆశ్రయులు ఉండేవారు. ఈనాడు ఆశ్రమంలో 270 సన్యాసులు ఉంటున్నారు.

"ఎరుక తెరలు తెగితేనే మరపు మటు మాయమౌతుంది. బ్రహ్మం బట్టబయలవుతుంది."

# మన రాష్ట్రాలు

## హిమాచల ప్రదేశ్

పర్వతమయమైన హిమాచల ప్రదేశ్ ఉత్తర దిక్కున జమ్మూ మరియు కాశ్మీర్ తూర్పుదిక్కున టిబెట్ (చైనా), దక్షిణ దిక్కున ఉత్తర ప్రదేశ్, పశ్చిమాన హర్యానా మరియు పంజాబు ఆవరించి ఉంటుంది. సట్లెజ్, రావీ, చినాబ్, బీస్ మరియు యమునా నదులు




ఇక్కడ ప్రవహిస్తూంటాయి ఈ నదులన్నీ మంచు నీటి నదులు కాబట్టి ఇని ఎప్పుడూ ఎండిపోవు.

హిమాచల ప్రదేశ్ ఏప్రిల్ 15,1948న పార్ట్ C స్టేటుగా ఏర్పడింది. ఇందులో సిమ్లా మరియు పంజాబ్ హిల్ రాష్ట్రాలు మొత్తం 31 రాజాస్థానాలు చేరి ఉంటాయి. మొట్ట మొదటి ఆరు జిల్లాలు చేరిన బిలాస్‌పూర్ స్టేటు 1954లో దీంట్లో చేర్చబడింది. 1966లో ఆ నాటి పంజాబు పునఃవ్యవస్థీకరణంతో ఇది ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది. కంగ్రా, కులు, లాహుల్, స్పిటి, సిమ్లా జిల్లాలు అన్నీ దీంతో చేరాయి. పూర్వం కేంద్రపాలిత రాజ్యంగా ఉన్న హిమాచల ప్రదేశ్ జనవరి 25, 1971న భారతదేశపు 18వ రాష్ట్రంగా ఏర్పడింది.

హిమాచల ప్రదేశ్ వైశాల్యం 55,673 చ.కి.మీలు. దీంట్లో మొత్తం 12 జిల్లాలు. ఇక్కడ హిందీ మరియు పహారి ముఖ్యమైన భాషలు ఇక్కడ మొత్తం జనాభా 42,80,818. జనసాంద్రత చ.కి.మీ.కి 77. ఇక్కడ విధాన సభ ఒక్కటే లెజిస్లేచర్ హౌస్. దీంట్లో 68 సభ్యులు ఉంటారు హైకోర్టు సిమ్లాలో ఉంది.

ఈ నాడు హిమాచల ప్రదేశ్‌లో అక్షరాస్యత 43 శాతం. సుమారు 76 శాతం జనాభా వ్యవసాయం, తోటల పెంపకం మీద ఆధార పడి ఉన్నారు. మొత్తం వ్యవసాయ భూమిలో 26 శాతానికి నీటిపారుదల సౌకర్యం ఉంది. ఇచ్చట గోధుమ, జొన్న, వరి ముఖ్యమైన పంటలు గింజబంగాళాదుంప, అల్లం వాణిజ్య పంటలుగా ప్రసిద్ధిపొందాయి. ఆపిల్, ద్రాక్ష, పీచ్, ఆప్రికాట్, పియర్స్, ప్లమ్, ఖర్జూరం మొదలైన పళ్లు విస్తారంగా పండిస్తారు.

మొత్తం రాష్ట్ర వైశాల్యంలో 38.3 శాతం అడవులతో నిండి ఉంది. ఈ అడవుల నుండి కలప, జిగురు, లక్క, వంటచెరకు, బొగ్గు లభిస్తాయి. హిమాచలప్రదేశ్‌లో రాతి ఉప్పు, పలక, జిప్సమ్, సున్నపురాయి, బెరైట్సు, డొలామైట్, పైరైట్స్ గనులు ఉన్నాయి.

ఆర్గనైజ్డ్ సెక్టార్ (క్రమబద్ధం చేయబడిన రంగం)లో గల 7000 చిన్న తరహా పరిశ్రమలలో మొత్తం 42,000 మంది పనిచేస్తున్నారు. మైక్రోస్కోపులు, వాచ్ విడిభాగాలు, వివిధ థర్మామీటర్లు, హాస్పిటళ్లకు కావలసిన సాధనాలు

"శ్రవణం తరువాత మననం ముఖ్యాతిముఖ్యం."

మొదలైనవి ఇక్కడ తయారు కాబడతాయి. కఱ్ఱ నగిషీపనులు, కంచరి పనులు, ఉన్ని వడకుట, నేయుట, చర్మం పదును పెట్టుట, కుండలు తయారీ, వెదురు వస్తువుల తయారీ మొదలైన గ్రామీణ మరియు కుటీర పరిశ్రమలు కూడా వృద్ధిపొందుతున్నాయి.

హిమాచల ప్రదేశ్‌లో అనేక భారీ పరిశ్రమలు కూడా ఉన్నాయి నహాన్‌లో నహాన్ ఫౌండ్రి, నహాన్ మరియు బిలాస్‌పూర్‌లో రెజిన్ అండ్ టర్పెంటైన్ ఫాక్టరీలు, సోలాన్‌లో బ్రూయరీలు ముఖ్యమైనవి ప్రభుత్వరంగంలో హిమాలయా ఫెర్టిలైజర్స్ లిమిటెడ్ వారు "NPK" పలుకుల రూపంలో సమతూకపు ఎరువుల



తయారీ ప్రారంభించారు. సిమ్లా దగ్గర షోజ్ హాయ్‌లో ఎలక్ట్రానిక్ కాంప్లెక్స్ ఏర్పాటు చేయబడింది. రాష్ట్రంలో గల 12 జిల్లాలలో జిల్లాస్థాయి పారిశ్రామిక కేంద్రాలు ఉన్నాయి. పర్వానూలో ఫ్రూట్ ప్రోసెసింగ్ ప్లాంట్ మిక్కిలి అధునాతనమైనది. ఇదే ఆసియాలో బ్రహ్మాండమైన ఫ్రూట్ ప్రోసెసింగ్ ప్లాంట్

రాష్ట్రంలో మిక్కిలి సుందరమైన చాంబా ప్రాంతంలో 540 MW చామెరా ప్రాజెక్ట్ పూర్తి కాబడుతుంది. రావి నదీజలాలనుంచి జల విద్యుత్తును జనింపచేయడానికి ఇది అనుకూలంగా ఉంటుంది.

ఆసియాలో మిక్కిలి పెద్ద పవర్ ప్రాజెక్ట్ నాత్పా-జాక్రీ హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్ట్ కూడ పూర్తి కాబడుతుంది. ఒక్కొక్కటి 250 MW చొప్పున 6 యూనిట్లు మొత్తం 1500 MW శక్తిని జనింప జేస్తాయి. హిమాచల ప్రదేశ్‌లో గల వాసయోగ్యమైన 16,778 గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కలిగించబడింది.

హిమాచల ప్రదేశ్‌లోగల రోప్‌వే భారత దేశంలోనే మిక్కిలి పొడవైనది. కేబిల్ కారు




మీద 8 నిమిషాల కంటే తక్కువ కాలంలో 1.8 కి.మీ.లదూరం 18 మంది ఒకేసారి ప్రయాణం చేయవచ్చు.

హిమాచల ప్రదేశ్ ముఖ్యపట్టణమైన సిమ్లా సముద్ర మట్టానికి 2213 మీటర్ల ఎత్తున ఉండే కొండవిడిది ఇది ప్రపంచంలో మిక్కిలి

## అవి చెడ్డ కర్మలు

మనమాచరించు బాహ్యకర్మల వలన మనకు పూర్తి సఫలత చేకూరినను, ప్రజలు మనలను జయజయ ధ్వనులతో గౌరవించినను, ఆ కర్మల వలన మన సద్గుణములు వృద్ధిచెందని యెడల అవి చెడ్డ కర్మలని గ్రహింపవలెను. వానివలన మన మధోగతినే పొందుదుము. అంతే కాదు ప్రపంచమునుగూడ అధోగతి పాలు చేయుదుము.

"సత్యం ఉన్నచోట ధర్మం ఉంటుంది.
ధర్మం ఉన్నచోట విజయం ఉంటుంది."

పెద్దది. వేసవిలో వాతావరణం మిక్కిలి ఆహ్లాదకరంగా ఉంటుంది. శీతకాలంలో (–5°C) చల్లగా మంచు కురుస్తూంటుంది పంజాబ్‌లో కల్కా నుంచి సిమ్లాకు 90 మైళ్ళ దూరం చిన్న రైలు లేక బస్సులోనో కారులోనో, వెళ్ళ వచ్చు




ప్రపంచంలో సుప్రసిద్ధ కొండ విడిదిగా పేరుపొందిన సిమ్లాను 1819లో బ్రిటిష్ సైన్యాధికారి రోస్ కనిపెట్టాడు. సిమ్లాలో వివిధ క్రీడలకు, ఆటలకు అనేక అవకాశాలు ఉన్నాయి. మంచుతో కప్పబడిన సిమ్లా స్కేటింగ్, స్లెడ్జింగ్, ఐస్‌హాకీ, స్కైయింగ్ మొదలైన వాటికి చాలా అనుకూలంగా ఉంటుంది. సిమ్లానుండి 16 కి.మీ.ల దూరంలో గల కుఫ్రీ స్కీయింగ్‌కి ప్రసిద్ధి పొందింది. సిమ్లాకు 45 కి.మీ.ల దూరంగా చైల్ (chail) లో క్రికెట్ మైదానం 2250. మీటర్ల ఎత్తున ఉంది. ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన ప్రదేశంలో వున్న క్రికెట్ మైదానం ఇదొక్కటే.

కాల్కా-సిమ్లా రోడ్డుమీద కసోలి ఒక చిన్న అందమైన కొండవిడిది. ఇక్కడ ఉన్న పాస్ట్యూర్ ఇన్‌స్టిట్యూట్‌లో కుక్క కాటుకు రాబీ టీకాల మందు తయారు చేస్తారు. ప్రపంచ ప్రసిద్ధి పొందిన లారెన్స్ స్కూలు కసోలికి 16 కి.మీ.ల దూరంగా సానోవార్‌లో ఉంది

చండీఘర్‌కు 90 కి.మీ.ల దూరంగా ఉన్న నహాన్ మిక్కిలి అందంగా నిర్మించబడిన నగరం. ఇక్కడ అనేక చెరువులు త్రవ్వబడ్డాయి. సుందరమైన తోటలతో అనేక దేవాలయాలతో అలరారుతూంటుంది. నహాన్‌కు దగ్గరగా మార్కాండ నది ఒడ్డున గల సకేతి ఫాసిల్ పార్క్‌లో ఫైబర్ గ్లాస్‌తో తయారైన జంతువులు ప్రదర్శింపబడతాయి. ఇవి 85 మిలియను




సంవత్సరాలకు పూర్వం ఇచ్చటి షివాలిక్ పర్వత ప్రదేశపు జంతువుల బొమ్మలు.

## జీవితం రంగస్థలం

ప్రపంచము పూర్ణము. మనకొలది జీవితములతో ఈ రంగస్థలిపై నటించి పోవునవకాశము మనకు లభించినది. నీటిపైని అలలు లేమన గదా! ఒక అల లేచి అణగిపోయిన దాని వెనుకనే మరియొక అల లేచును. అదియు అణగిపోవును. ఉన్నదంతయు నీరే. మనము నంతే. మన నటన ముగియగానే మనము రాలిపోదుము. ఇతరులాస్థానము నాక్రమింతురు. ఈ విధముగా మనమాలోచించినచో అశాంతికి కారణమే యుండనేరదు.

"నీటిమీద పరచినట్లుండే తామరాకు నీరు తరిగే
కొలదీ తరుగుతుంది, పెరిగేకొద్దీ పెరుగుతుంది."

నేహాన్‌కు 45 కి.మీ ల దూరంగా యమునా నది గట్టుమీద ఉన్న పవోన్టా సాహెబ్ శిక్కుల 10వ మత గురువైన గురు గోవింద్ సింగ్ జ్ఞాపకార్థం పవిత్రస్థలంగా ఏర్పడింది. ఇతడి ఆయుధాలు ఇక్కడి గురుద్వారాలో ప్రదర్శింపబడుతున్నాయి పవోన్టా సాహెబుకు చేరువగా హిమాలయ పర్వత ప్రదేశంలో చిబ్రాన్ పవర్ హౌస్ భూమి క్రింద నిర్మించబడింది




బీస్‌నది ఎడమగట్టున శివాలిక్ పర్వత శ్రేణిలో గల మండీలో అనేక అందమైన శిలా విగ్రహాలు ఉన్నాయి. బిలాస్‌పూర్ నుండి మండీకి ప్రయాణం చేస్తూంటే స్లాపెర్ (slapper) దగ్గర రూ. 386 కోట్ల ఖర్చుతో నిర్మింపబడిన బీస్ సట్ లెజ్‌లింక్ ప్రాజెక్టను చూడవచ్చు.

ధర్మశాల ప్రశాంతమైన ఆరోగ్య కేంద్రంగానే గాక ముఖ్యమైన కొండ విడిదిగా పేరు పొందింది పంజాబ్‌లో పఠాన్‌కోట నుండి దీనిని సులభంగా చేరవచ్చు 1960 లో దలాయ్‌లామా దీనిని తాత్కాలిక నివాస స్థలంగా ఏర్పరచుకున్నారు ఈనాడు ఇది 'ది లిటిల్ లాసా ఇన్ ఇండియా'గా ఎంతో ప్రఖ్యాతి పొందింది. టిబెట్ సాంప్రదాయక నృత్య సంగీత వాద్యాలు 'ది టిబెటన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పెర్‌ఫార్మింగ్ ఆర్ట్స్'లో భద్రపరచబడ్డాయి

ధర్మశాలకు 18 కి.మీ.ల దూరంగా ఉన్న కాంగ్రా అనేక దేవాలయాలకు ప్రసిద్ధి పొందింది వీటిలో మిక్కిలి ప్రసిద్ధి పొందినది బ్రజేశ్వరి దేవాలయం

కాంగ్రాకు 30 కి.మీ.ల దూరంగా ఉన్న జ్వాలాముఖిలో జ్వాలాముఖి దేవాలయం ఎంతో రమణీయంగా ఉంటుంది. ఈ దేవాలయంలో ఏ విగ్రహం ఉండదు. కానీ గర్భ గుడి శిలనుంచి నీలిరంగు జ్యోతి కాంతివంతంగా మండుతూంటుంది.




## ప్రపంచంలో మోటారు ఉపయోగించిన మొట్ట మొదటి రాజు

1888 లో పర్షి సుల్తాను మొట్టమొదటి మోటారు కారును నడపడం ప్రారంభించాడు. ఇతడే ప్రపంచంలో మొట్టమొదటి మోటారు కలిగియున్న రాజు

"కర్తృత్వం ఆరోపించుకోకుండా ఉంటే
పని కుంటుపడకుండా కొనసాగి పోతుంది."

కాంగ్రాలోయలో ధర్మశాలకు 56 కి.మీ.ల దూరంలో ఉన్న బైజ్‌నాథ్ లోని దేవాలయం అతి ప్రాచీనమైన శివాలయం భారతదేశపు ద్వాదశ లింగాలలో ప్రసిద్ధిపొందిన వైద్య నాథలింగం ఇక్కడ ఉంది కాంగ్రాలోయలో పలాంపూర్ సుందరమైన ప్రదేశం చుట్టూ నాలుగు దిక్కుల అందమైన టీ తోటలతో, పైన్ వృక్షాలతో నిండి ఉంటుంది పలాంపూర్ లోని అగ్రికల్చురల్ యూనివర్శిటీలో వ్యవసాయ పరిశోధనకు వసతి సౌకర్యాలు ఉన్నాయి


NAATI DANCE

పఠాన్‌కోట్ - చాంబా రోడ్డు మీదగల 'డల్‌హౌసీ' రమణీయమైన పర్వత విడిది దీనికి పూర్వపు వైస్రాయి లార్డ్ డల్‌హౌసీ పేరు పెట్టబడింది డల్‌హౌసీలో కాలతోప్ సుప్రసిద్ధమైన విలాసకేంద్రం ఇచ్చట బార్కింగ్‌డీర్, బ్లాక్‌డీర్ మొదలైన జంతువులను చూడవచ్చు

డల్‌హౌసీకి 53 కి మీలు దూరంగా రావి నదిగట్టు మీద చాంబానుంచి చూడడానికి ప్రకృతి మిక్కిలి రమణీయంగా ఉంటుంది ఇచ్చట విష్ణు దేవాలయంలో చతుర్భుజుడైన విష్ణుమూర్తి విగ్రహం గంభీరంగా ఉంటుంది. వేసవిలో కులులోయ ఎంతో రమణీయంగా ఉంటుంది వసంతకాలంలో దీని అందం చెప్పనలవికాదు కులునగరం బీస్‌నది గట్టు మీద ఉంది కులునుండి బీస్‌నది మీదుగా 14 కి మీ.ల దూరంలో బిజ్లీ మహాదేవ్ ఆలయం ఉంది 11 కి.మీ.ల ఎత్తు కొండ అతికష్టంగా ఎక్కవలసి వస్తుంది కొండమీద ఉన్న 60 అడుగుల ధ్వజస్తంభం దేవుని అనుగ్రహాన్ని మెరుపులుగా గ్రహిస్తుందని ఇచ్చటి ప్రజల విశ్వాసం

కులు లోయలో మలనా గ్రామం చాలా వింతగా ఉంటుంది ఈ గ్రామంలో నివసించే ప్రజలు ఇంకొక చోట భోజనాలు చేయరు. ఇతర గ్రామాల వారితో వివాహ సంబంధాలు కలుపుకోరు వారు మాట్లాడుకునే భాష వారికి తప్ప ఇంకొకరికి తెలియదు. వీరిది ప్రపంచంలో మిక్కిలి పురాతనమైన ప్రజాపాలిత ప్రదేశం. కులులోయ అనేక సంతలకు, వేడుకలకు చాలా ప్రసిద్ధి పొందింది బీస్ నదిని చుట్టి ఉండే ధల్‌పూర్ మైదానంలో ప్రతి సంవత్సరం అక్టోబరు మాసంలో దసరా ఉత్సవం ఎంతో వైభవంగా జరుపుకుంటారు

## కైలాస్ దేవాలయం నిర్మాణానికి 100 సంవత్సరాలు పట్టింది

భారతదేశం మహారాష్ట్రంలో ఎల్లోరాలో కైలాస్ దేవాలయాన్ని నిర్మించడానికి 100 సంవత్సరాలు పట్టింది. భూతలం మీద ప్రారంభించిన దేవాలయం క్రిందికి నిర్మించబడింది. నిర్దేశించిన ప్రదేశంలో మొట్టమొదట కొండ త్రవ్వబడింది. తరువాత దేవాలయం పైభాగం చెక్కబడింది. కాలం గడిచిన కొద్దీ గర్భగుడి ఒక చివరనుండి మరో చివరకు కోరబడింది.

"ముఖ్యమైన విషయాలలో ఏకత్వం, ముఖ్యంకాని వాటిలో స్వేచ్ఛ, అన్నింటిలోను దాతృత్వం కలిగి ఉండడమే వెలుగు బాటకు మార్గము."

కులు నగరానికి 40 కి.మీ.ల దూరంలో అందమైన లోయలోగల మనలి నుంచి మంచుతో కప్పబడిన పర్వత శిఖరాలను చూడవచ్చు. ఇక్కడ ఉన్న మౌంట్‌నీరింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో హైకింగ్, ట్రెక్కింగ్, మౌంట్ నీరింగులకు శిక్షణ ఇవ్వబడుతుంది.

హిమాచల ప్రదేశ్ శీతాకాలంలో అతి శీతలంగా ఉంటుంది. శీతాకాలంలో కొండలు,



లోయలు విపరీతమైన మంచుతో కప్పబడి ఉంటాయి ఇచ్చట నివసించే జనం ప్రయాణా లకు చిన్న చిన్న గుర్రాలను ఉపయోగిస్తారు పండ్ల తోటలను పెంచడం వీరి ముఖ్య వృత్తి వరి, జొన్న, మినుము, పెసర, కందగడ్డ బంగాళదుంపలు, గోధుమ, పాలతో తయారైన వస్తువులు మొదలైనవి విస్తారంగా వాడతారు.

హిమాచల ప్రదేశ్‌లో జనం చురిధార్ పైజామా, పొడుగుపాటి లాల్చీలు ధరిస్తారు పురుషులు టోపీలు పెట్టుకుంటారు. స్త్రీలు అందమైన రుమాళ్లు తలకు చుట్టుకుంటారు స్త్రీలు ఆభరణ ప్రియులు.

ప్రత్యేకంగా పండుగ సమయాలలో అందరూ చేరి భక్తిగీతాలు పాడుకుంటారు ఈ పాటలకు అనుగుణ్యంగా నృత్యం కూడా చేస్తూంటారు. దీనినే వారు నాట్టి అంటారు బహుశ ఈనాట్టి సంస్కృతం నాట్యం లేక నృత్యం నుంచీ ఏర్పడి ఉండాలి. లేక నాటు దేశవాళీ అనే అర్థంలో నాట్టి ప్రయోగించి ఉండవచ్చు.

హిమాచల ప్రదేశ్ అంతా అడవి జంతు వులతో నిండి ఉంటుంది మస్క్‌డీర్ ఐబెక్స్, థార్, హిమాలయ ఎలుగుబంటి, మంచు చిరుతలు మొదలైన జంతువులు, మొనాల్ ట్రాగోపాన్, కోకియాష్, మంచుకోడి మొదలైన పక్షులు ఇక్కడ నివసిస్తాయి. కులు శాలువలు అతి మృదువుగా అందంగా ఉంటాయి. ఉన్నికి, అంచులకు ఇవి మిక్కిలి ప్రసిద్ధి పొందినవి

## కోరికవల్లే చిక్కులు

*లేని దానికోసం కావాలని ప్రయత్నం చేయడం కోరిక. ఈ కోరికవల్లే మానవుడికి జీవితంలో చిక్కులు సంభవిస్తున్నాయి.*

*కోరిక అనేది స్థిరంగా ఉండేదికాదు. క్షణక్షణం మారుతూంటుంది. చిన్నప్పుడు బొమ్మలు బొంగరాలు కావాలనే కోరిక ఉంటుంది. బాల్యావస్థలో ఆటలు ఆడుకోవాలని కోరికలు ఉంటాయి. కౌమారంలో అలంకరించుకోవాలని కోరిక ఉంటుంది. యౌవ్వనంలో ప్రేమించాలని కోరిక, ముసలితనంలో ఇంకా నాలుగు కాలాల పాటు జీవించాలని కోరిక మరణం లేకుండా కలకాలం జీవించాలనే కోరిక ఎప్పుడూ ఉంటుంది.*

*మనస్సులో కోర్కెలను చంపుకుని ఆత్మయందే ఆత్మవలన సంతృప్తుడై ఉండు వానిని స్థితప్రజ్ఞుడు అంటారు.*

*—భగవద్గీత*

"కోరికలు తీరుటవలన సుఖము కలుగుననుట సత్యము కాదు."

# కలం స్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షికక్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. — సంపాదకుడు]

1 బలరాములు, S/o చిన్నకూర్మన్న, వడ్యాటు పోస్టు, మఖ్తల్ తాలూకా, (మహబూబ్ నగర్‌జిల్లా) 509 208
కలం స్నేహం

2 చిటికెల కోటేశ్వరరావు, 23 సం॥లు, S/o నరసింహమూర్తి, సుంకపూరు, కోటవురట్ల మండలం (విశాఖజిల్లా)
చదరంగం, కారమ్స్ ఆడడం, ప్రకృతి ఆరాధన.

3 జి. వాసు, డిగ్రీ మొదటి సంవత్సరం, 17 సం॥లు, ఇం నెం 7-4-115, చిన్న మజీద్ రోడ్, సిద్ధిపేట (మెదక్‌జిల్లా) 502 103
అందరితో స్నేహం, టివి చూడడం, ప్రకృతి ఆరాధన

4 ఎమ్. సునీత్ కుమార్, బి.ఏ, 23 సం॥లు, సి.ఆర్ క్లబ్ దగ్గర, చిలకలూరిపేట (గుంటూరుజిల్లా) 522 616
పుస్తక పఠనం, క్రీడాసక్తి, విజ్ఞానాభివృద్ధి

5 అల్లంపల్లి జయరాములు, S/o లక్ష్మయ్య అనంతసాగర్, సదాశివపేట (మెదక్ జిల్లా) 502 306
సాహిత్యాభిలాష, కలంస్నేహం

## 1988లో 105 మిలియను బైసికిళ్లు తయారు కాబడ్డాయి

*1988 వ సం.లో ప్రపంచంలో 105 మిలియను బైసికిళ్లు, అసెంబ్లీ లైన్లనుండి సిద్ధమై వెళ్లిన 33 మిలియను కార్లకు సుమారు 3 రెట్లు తయారైయాయి. వాషింగ్‌టన్ DC లో వరల్డ్‌వాచ్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన మార్షియాలోవె అభిప్రాయం ప్రకారం చాలామంది రాకపోకలకు కార్లకంటే బైసికిళ్లమీదే ఆధారపడి ఉంటారు.*

*ప్రపంచంలో సైకిళ్లే అధికంగా, సుమారు 800 మిలియను ఉన్నాయి. ప్రపంచంలో ప్రతి ఒక కారుకి రెండుసైకిళ్లు ఉన్నాయి. ఆసియాలో చాలామంది కార్లకంటే సైకిళ్లనే రాకపోకలకు అధికంగా వాడతారు.*

*అభివృద్ధి పొందుతూన్న ఇతర దేశాలలో ముఖ్యంగా పారిశ్రామిక దేశాలలో సైకిళ్లు విలాస వంతంగా తొక్కడానికే ఉపయోగిస్తారు కాని ఇప్పు డిప్పుడు రోడ్లమీద రద్దీ, వాతావరణంలో కాలుష్య నివారణల కోసం అనేక దేశాలు సైకిళ్లకే ప్రాధాన్యం ఇస్తున్నాయి. నెదర్‌లాండ్స్ పశ్చిమజర్మనీ, మరియు జపాన్ దేశాలు 'సైకిల్ స్నేహం' అభివృద్ధి చేసుకొంటూ ప్రత్యేకంగా బైసికిల్ మార్గాలు, సైకిల్ స్టాండులు, మోటారు వాహనాలు, సైకిళ్లరద్దీ నియంత్రణోద్యమాలు మొదలైన సౌకర్యాలు ఎన్నో ఏర్పరచుకున్నాయి.*

*—'ఇన్‌వెన్షన్ ఇంటలిజెన్స్' సౌజన్యంతో*

"శ్రేయాన్ని కోరేవాడు శుభాన్ని పొందుతాడు,
ప్రేయాన్ని కోరేవాడు పతనమై పోతాడు."

# చీమ అనుసరించిన మార్గం

కమ్మని నెయ్యి కావాలంటే ఎలా వస్తుంది? మంచివెన్న తీసుకు వచ్చి సన్నటి సెగమీద ఎర్రగా కాచాలి వెన్న పాలలో ఉంటుంది 'పాలలో వెన్న పాలలో వెన్న' అని ఎంత గట్టిగా అరచినా వెన్న చేతికి చిక్కదు వెన్న కావాలంటే మంచిపాలను ఎర్రగా కాచాలి కాచిన పాలను చల్లార్చాలి. చల్లారిన పాలలో తోడుపెట్టి పెరుగు చేయాలి ఆ పెరుగును కవ్వంతో చిలకాలి. అప్పుడే వెన్న లభిస్తుంది. లభించిన వెన్న కాచినప్పుడు కావలసిన కమ్మని నెయ్యి తయారవుతుంది దేనికైనా కార్యసిద్ధికి తగిన మార్గం అవలంబించాలి ధృఢవిశ్వాసంతో సక్రమ కార్య సాధన కొనసాగించాలి. సాక్షాత్కారం పొందాలంటే సాధన చేసి తీరాలి. కష్టించి సాధనలు కొనసాగింప జేస్తే గానీ సాక్షాత్కారం సులభంగా సిద్ధించదు!

సాధన విహంగ మార్గము, మర్కట మార్గము, పిపీలికా మార్గము అని మూడు రకాలు.

ఒక పక్షి ఎగురుతూ వచ్చి చెట్టుమీద వాలి పండును ముక్కుతో పొడుస్తుంది. ఆ ముక్కుపోటుకి పండు చెట్టునుండి రాలిపోతుంది. పండు పక్షికి దక్కదు అదే విధంగా తీవ్రంగా సాధనలు సాగించేవారు కొందరుంటారు. అది వారి ప్రయత్నాలనే భగ్నం చేస్తుంది ఇదే విహంగ మార్గం

కోతి ఒక పండును నోటిలో కరచుకుని చెట్టుమీద ఒక కొమ్మమీద నుంచి మరో కొమ్మకు దూకుతుంది ఆ సమయంలో అకస్మాత్తుగా ఆ పండు కాస్తా కోతి నోటినుండి జారి కిందపడిపోతుంది. అదే విధంగా మానవుడు జీవితంలో కలిగే ఒడుదుడుకుల వల్ల భ్రష్టుడై పోతున్నాడు. ఇది మర్కట మార్గం.

ఇక చీమ(పిపీలిక) నెమ్మదిగా నిశ్చయంగా బెల్లం ఉన్న చోటికి పైకి వెళ్లి చిన్న బెల్లం ముక్కను నోటకరుచుకుని తిరిగి తన కన్నం వైపుకి తీసుకువెళ్లి నెమ్మదిగా తింటుంది సాధనలలో చీమ అనుసరించిన పిపీలికా మార్గమే ఉత్తమోత్తమమైనది దీనివలన సాధనలు ఫలిస్తాయి ఫలప్రాప్తి నిశ్చయం ●

## సంతోషస్వభావం



విడిచి వికసించే పూవులకు సూర్యకాంతి వంటిది మానవులకు చిందులాడే చిరునవ్వు చిరునవ్వు ఎంత చిన్నదైనా జీవితంలో దానివల్ల కలిగే లాభం బ్రహ్మాండం ఊహించడానికి కూడా వీలు లేనంత ఉంటుంది అమాయకత్వంతో కూడిన చిరునవ్వు సౌందర్యాన్ని ఆకర్షణీయం చేస్తుంది విజ్ఞానాన్ని రంజింపచేస్తుంది ఆరోగ్యాన్ని అభివృద్ధి చేస్తుంది. నిష్కాపట్యాన్ని సర్వాంగ సౌందర్యాన్ని ఆపాదిస్తుంది

"దేశంలో ఐక్యమత్యం ఉండాలంటే వ్యక్తుల మధ్య సహకారం, పరస్పర అవగాహన ఉండాలి."

# హానికరమైన శబ్దకాలుష్యం

విమానాలు, రైళ్లు, కార్లు, భూమిని త్రవ్వే డ్రిల్లులు, రేడియో, టివి అన్నీకూడా శబ్దాన్ని కలిగిస్తాయి మానవుని పర్యావరణంలో ఇవి భయంకరమైన కాలుష్యాలు ప్రపంచ ఆరోగ్య సంస్థవారు పెద్దపెద్ద నగరాలలో 45 డెసిబిల్స్ నిరపాయకరమైన శబ్దస్థాయి అని నిర్ణయించారు



బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా, మద్రాసు వంటి నగరాలలో శబ్దం 90 డెసిబిల్స్ పైనే రిజిస్టరు అవుతుంది. ప్రపంచంలో విపరీతంగా శబ్దమయమైన మూడవ నగరం బొంబాయి అంటారు శబ్ద కాలుష్యానికి మన దేశంలో బొంబాయి తరువాత ఢిల్లీ రెండవది శబ్దస్థాయిని తగ్గించడానికి తగిన చర్యలు చేపట్టక పోతే 2000 సంవత్సరం నాటికి ఢిల్లీలో 50 శాతం పైగా జనం చెముడుతో బాధపడిపోతారు

65 డెసిబిల్స్ శబ్దస్థాయి వరకు అపాయం ఉండదని ఇంటర్నేషనల్ స్టాండర్స్ ప్రకారం నిర్ణయించారు అయినా హాస్పిటళ్లు ఉన్న ప్రదేశాలలో శబ్దం 35 నుండి 40 డెసిబిల్స్ మాత్రమే ఉండాలి

పశ్చిమ దేశాలలో పారిశ్రామిక ప్రదేశాలలో శబ్ద కాలుష్యాన్ని తగ్గించడానికి నిశ్శబ్దమైన మోటారు వాహనాలు ఉత్పత్తి చేయబడుతున్నాయి రోడ్డు ప్రక్క శబ్దగ్రాహక యంత్రాలను ఏర్పాటు చేస్తున్నారు అధికశబ్దం కలిగించరాదనే నిర్బంధాలు ఏర్పరచారు ప్రపంచంలో పెద్దపెద్ద నగరాలలో రాత్రిపూట విమానాల ప్రయాణం నిషేధించారు కానీ భారత దేశంలో శబ్దకాలుష్య నివారక ఉద్యమాలు చురుకుగా కొనసాగడంలేదు భారత దేశంలో చాలామంది నిత్యజీవితంలో శబ్ద కాలుష్యానికి అలవాటుపడి పోయారని పర్యావరణ రక్షణ నిపుణులు తెలియజేస్తున్నారు

1988లో ఇండియన్ ఎయిర్ పొల్యూషన్ కంట్రోల్ ఆర్డరు సవరణచేస్తూ శబ్దంకూడా కాలుష్యం అని నిర్ణయించి అందులో చేర్చారు వివిధ పరిశ్రమలు వాటికి సంబంధించిన

(మిగతా 28 వ పేజీలో)

## ప్రాణాలు విడిచిన వికార్

*గుండె నీరసంగా ఉన్న ఒక వృద్ధుడు లాటరీలో 50,000 డాలర్లు గెలుచుకున్నాడు. ఈ వార్తవింటే అధిక సంతోషంతో గుండె ఆగిపోతుందేమో అనే భయంతో బంధువులు చర్చిలో ఉన్న వికార్‌ను రమ్మని శుభవార్త మెల్లిగా తెలియ చెప్పమన్నారు. ఆ వికార్ (గురువు) ప్రేమతో ప్రారంభించి 'నీకు లాటరీలో 50,000 డాలర్లు బహుమానం వస్తే ఏం చేస్తావు' అని అడిగాడు. దానికావృద్ధుడు ఆలోచించి 'లాటరీలో వచ్చిన సొమ్ము అంతా చర్చికి ఇచ్చేస్తా' అని అన్నాడు. వెంటనే వికార్ అక్కడికక్కడే కూలబడి ప్రాణాలు విడిచాడు.*

"బాధ్యత విషయంలో బాధ్యత వహించలేక పోవడంవల్ల వ్యక్తి జీవితంలో ఒడుదుడుకులు ఏర్పడుతూంటాయి."

# ప్రపంచవార్తలు

## ప్రపంచవు ప్రప్రథమ ఇస్లామిక్ ఓపెన్ యూనివర్శిటీ

ప్రపంచంలో మొట్టమొదటి ఇస్లామిక్ ఓపెన్ యూనివర్శిటీ పశ్చిమ జర్మనీ ఆచెన్ (Aachen) నగరంలో ఏర్పాటైంది. ఇస్లామిక్ న్యాయశాస్త్రం, అరబిక్ భాష మరియు వాఙ్మయం అభివృద్ధికి కోర్సులు ఉన్నాయి. అరబ్ దేశాలలో ఇతర పెద్ద పెద్ద యునివర్సిటీల ప్రాపు దీనికి ఉంది. అటువంటి యూనివర్శిటీలలో కెయిరో అల్-అజ్‌హార్ యూనివర్శిటీ ఒకటి.

## ప్రపంచంలో బ్రహ్మాండమైన గోళాకారవు భవనం

ప్రపంచంలో బ్రహ్మాండమైన గోళాకారవు భవనం స్వీడెన్ దక్షిణ స్టాక్‌హోమ్‌లో జుహనెస్‌హొవ్‌లో నిర్మింపబడుతూంది. జన బాహుళ్యానికి బహుముఖంగా ఉపయోగపడే వివిధ ప్రదర్శనలు నిర్వహింపబడడానికి వీలుగా ఉండే పెద్ద రంగస్థలం పైన వర్తులాకారవు డోము ఉంటుంది. 16,000 మంది ప్రేక్షకులకు అనుకూలవంతంగా ఉండి సంవత్సరానికి 100 వివిధ ప్రదర్శనలకు మరియు టెన్నిస్, ఐస్‌హాకీ క్రీడలకు అనువుగా ఉంటుంది.

## యు.ఎస్.ఎ.-ప్రపంచంలో అత్యధికంగా వ్యవసాయోత్పత్తులను ఎగుమతి చేస్తూంది

1988 లో ఫెడరల్ రిపబ్లిక్ అఫ్ జర్మనీ మొత్తం DM 29 బిలియను విలువగల

## కప్పులు-ట్రోఫీలు




రంగస్వామి కప్ నేషనల్ హాకీ (ఇండియా)
స్వేత్‌లింగ్ కప్ వరల్డ్ టేబిల్ టెన్నిస్ (పురుషులకు)
ఉబెర్ కప్ వరల్డ్ బాడ్మింటన్ (స్త్రీలకు)
వాల్కర్ కప్ గోల్ఫ్
రోహింటన్ బారియా ట్రోఫీ క్రికెట్ (ఇంటర్‌యూనివర్సిటీ, ఇండియా)
రెనెఫ్రాంక్ కప్ హాకీ(ఇండియా)
సంతోష్ ట్రోఫీ నేషనల్ ఫుట్‌బాల్ (ఇండియా)
రోవర్స్ కప్ ఫుట్‌బాల్
వెల్లింగ్‌టన్ ట్రోఫీ రోయింగ్
థామస్ కప్ వరల్డ్ బాడ్మింటన్
వింబుల్డన్ ట్రోఫీ లాన్ టెన్నిస్ (ఇంగ్లండ్)

"చెప్పేదానికి, చేసేదానికి, చింతించేదానికి పొంతనతో సమతూకం సాధించినవాడే అసలైన సాధకుడు."

ఆహార మరియు వ్యవసాయోత్పత్తుల ఎగుమతులతో ప్రపంచంలో నాల్గవ స్థానాన్ని ఆక్రమిస్తూంది మొట్ట మొదటి మూడు స్థానాలు యునైటెడ్ స్టేట్స్, ఫ్రాన్స్ మరియు నెదర్లాండ్స్ ఆక్రమిస్తున్నాయి.

## యూరప్‌లో ప్రప్రథమ సౌరశక్తి నిలయం

యూరప్ ప్రప్రథమ సౌరశక్తి నిలయం యుగొస్లేవియా ఎడ్రియాటిక్ తీరంమీద డుబ్రోవ్‌నిక్‌కి దగ్గర కుపారీలో నిర్మించబడుతుంది. దీని వైశాల్యం 11,200 చ.మీటర్లు. దీనిలోపల 9,216 సౌరపలకలు (Solar Plates) ఏర్పాటు చేయబడతాయి. ఇచ్చట సంవత్సరానికి 2,10,000 kwh పైబడిన విద్యుత్‌శక్తి ఉత్పత్తి చేయబడుతుంది

## ప్రపంచంలో మిక్కిలి చిన్న లేసర్లు

జపానులో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు ప్రపంచంలో మిక్కిలి చిన్న లేసర్లను సృష్టించారు. వ్రేలి గోరంత చిన్న పరిమాణంగల చిప్‌లో ఇటువంటి లేసర్లు 2 మిలియను ఇమడ్చవచ్చు. ఈ లేసర్లు అతి తక్కువ విద్యుచ్ఛక్తిని వినియోగించుకుంటూ సాధారణ సెమీ కండక్టర్ లేసర్లు ఆక్రమించే స్థలంలో 1 శాతం స్థలం మాత్రమే ఆక్రమిస్తాయి కంప్యూటర్ చిప్స్ మధ్య సిగ్నల్స్ పంపడానికి ఇవి ఉపయోగ పడతాయి.

## ఎలర్జీ కలిగించిన కాంటాక్ట్ లెన్సులు

సోవియెట్ యూనియన్‌లో పసిఫిక్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ బయో ఆర్గానిక్ కెమిస్ట్రీలో ఎలర్జీ కలిగించని కాంటాక్ట్ లెన్సులను అభివృద్ధి చేసారు. పీతల పైపెంకులో ప్రకృతి సిద్ధంగా లభించే చిటిన్ మరియు చిటోసాన్ అనే పదార్థాలతో ఇవి తయారు కాబడ్డాయి.

●

## ఆదర్శాల శక్తి



DR.ALBERT SCHWEITZER

ఆదర్శాల శక్తి లెక్కకట్టజాలనంత ఉంటుంది. ఒక్క నీటిబొట్టులో మనకు ఏ శక్తి కనిపించదు. కానీ ఇవే ఒక రాతి పగులలో చేరి గడ్డకట్టుకుపోతే ఆ రాతిని పగులకొట్టేస్తుంది. ఒక ప్రవాహంగా మారితే, బ్రహ్మాండమైన యంత్రపుచక్రాలను త్రిప్పుతుంది. అంతర్గతంగా ఉన్న ఒక అపూర్వ శక్తి సామర్థ్యం చైతన్యవంతంగా ప్రభవిస్తుంది. అదేవిధంగా మానవుని ఆదర్శాలు కూడా. ఆదర్శాలు మనోభావాలు. అవి మనస్సులో ఆలోచనలుగా ఉన్నంతకాలం ఎంత ఉత్సాహపూరితమైనా, ఎంత విశ్వాసపూర్వకమైనా వాటి శక్తి అంతర్గతంగా అగోచరమై ఉంటుంది. కానీ వాటిని వ్యక్తిగతంగా ఆచరించగలిగితే వాటి శక్తి ప్రభావితమవుతుంది.

—ఆల్బర్ట్ స్విట్జర్

"తప్పుదారిని పట్టినా ఎప్పుడో ఒకప్పుడు
సరైనదారి తెలుసుకుంటారు అడుగుతూ వెడితే."

# రాట్నం సందేశం

మహాత్మాగాంధీ

స్త్రీలకైనా, పురుషులకైనా మరోపని సాధ్య పడనివారికి రాట్నం ఒక అపూర్వ సందేశాన్ని ఇస్తుంది 'నన్ను వడకండి మీ కడుపులు నిండుతాయి''. ఇదే ఆర్థిక సంబంధమైన రాట్నం సందేశం.

రాట్నం ఇచ్చే సందేశాలలో సాంస్కృతిక సంబంధమైన సందేశం కూడా ఒకటి ఉంది రాట్నం ఇచ్చే ఈ సాంస్కృతిక సందేశం ఏమిటి? ఇది మీకు నాకు అందరికీ వర్తిస్తుంది.



భూమి మీద కోటానుకోట్లు జనాభా కూటికీ, గుడ్డకీ కూడా చాలీ చాలకుండా ఉన్నారు. వ్యక్తిగతమైన పని పాట్లకు అంతరాయం కలిగించకుండా ఈ కోటానుకోట్ల మందికి వినియోగపడే ఏకైక సాధనం రాట్నం మీ అందరి కోసం నన్ను ఉపయోగించి గౌరవ ప్రదమైన పారిశ్రామిక వాతావరణాన్ని సృష్టించగలరు. ఏ శ్రమా లేకుండా అందరూ స్వశక్తినే నమ్ముకుని ప్రత్యాశాభావంతో జీవించ గలుగుతారు. ఇదే రాట్నం ఇచ్చే సాంస్కృతిక సందేశం. ఏ మతానికి చెందినా, ఏ దేశానికి చెందినా, ఏ కులానికి చెందినా విచక్షణా రహితంగా అందరికీ రాట్నం ఇచ్చే సందేశమిది

నూలువడికే రాట్నం ఇచ్చే మూడో సందేశం ఒకటి ఉంది ఉన్నతాశయాలతో సామాన్య జీవనమే దీని సారాంశం తమ్ము తాము తెలుసుకోకుండా, తమ సృష్టికి కారణభూత

(మిగతా 29 వ పేజీలో)

## ప్రపంచంలో అధికంగా అడవి జంతువులను దిగుమతి చేసుకొనే దేశం

ప్రపంచంలో యుఎస్ఏ అడవి జంతువులను మిక్కిలి అధికంగా దిగుమతి చేసుకుంటుంది. ప్రతీ సంవత్సరం అర బిలియను డాలర్ల విలువ గల జంతువులు వాటికి సంబంధించిన వస్తువులు చిలుకలు మొదలు ఆఫ్రికా ఏనుగు దంతపు ఆభరణాలదాకా అన్ని వస్తువులు వస్తాయి.

—'సిఐఐ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

( 25 వ పేజీ తరువాయి)

సంస్థలలో శబ్ద స్థాయిని తగ్గించడానికి తగిన విధానాలు అవలంబించమంటారు. బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ (BIS) వారుకూడా కొత్త శబ్ద కాలుష్య స్థాయిలను నిర్ణయిస్తున్నారు కొన్ని లాబొరేటరీలలో పరిశోధకులు శబ్దగ్రాహక పరికరాలను కనిపెడుతున్నారు

పర్యావరణంలో వచ్చునిచెట్లు, మొక్కలు శబ్దాన్ని గ్రహిస్తాయని కొందరు శాస్త్రజ్ఞులు అభిప్రాయాన్ని సూచిస్తున్నారు రోడ్లమీద రెండు ప్రక్కలా చెట్లు శబ్ద తరంగాలను ఆకర్షిస్తాయి

యోజనా సౌజన్యంతో

"మానవునికి తరగని సంపద ఆధ్యాత్మిక జ్ఞానము."

# మొహెంజొదారో

సింధు (ఇప్పుడు పాకిస్థాన్)లో ఉన్న సుక్కూర్‌కు సుమారు 105 కి మీ దూరంలో సర్‌జాన్ మార్షల్ మరియు సర్ మార్టిమోర్ వీలర్ మహాశయులు భూమిని త్రవ్వి ప్రసిద్ధి పొందిన మొహెంజొదారో (శవాలదిబ్బ)ను కనుగొన్నారు మొహెంజొదారో 2500 మరియు 1500 బిసిలో ప్రవృద్ధి పొందిన నాగరికతకు ముఖ్యకేంద్రం



ప్రణాళికాబద్ధంగా నిర్మింపబడిన అందమైన పురాతన నగరాన్ని మొహెంజొదారో శిథిలాలు ప్రకటింపజేస్తున్నాయి. ఇచ్చట త్రవ్వి కనుగొన్న గృహాలలోను, షాపులలోను భారత దేశపు గ్రామాలలోను, పట్టణాలలోను నేటికీ తెలియని స్నానాల గదులు, మురికినీటి పారుదల సౌకర్యాలు మొదలైనవి ఉన్నట్టు కనిపిస్తుంది

మొహెంజొదారో శిల్పులు, పనివారు ఆనాడు బంకమట్టిని ఉపయోగించి గృహాలు నిర్మించారు, అనేక వస్తువులను తయారుచేసారు అనేక చిత్రాలను, శిల్పాలను తీర్చిదిద్దారు ఇటీవల ఈ ప్రదేశంలో భూగర్భ జలాలు పైకి వచ్చాయి దాని ఫలితంగా నేడు ఈ మొహెంజొదారో శిథిలాలు తడిమట్టిలో కప్పబడిపోయాయి. నీరు ఆవిరిగా మారిపోగా మిగిలిన లవణాలు ప్రాచీన మొహెంజొదారో ఇటుకలను, శిల్పాలను కాన్సర్‌లాగ తినేస్తున్నాయి ప్రస్తుతం యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్ సైంటిఫిక్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్ (UNESCO) మొహెంజొదారో ప్రాచీన శిల్పాలను సంరక్షించడానికి సహకరిస్తుంది

( 28 వ పేజీ తరువాయి)

మైన భగవంతుని తత్త్వం తెలుసుకోకుండా కేవలం అనంతమైన భౌతిక సుఖసంపదలను ఇతోధికంగా అభివృద్ధి చేసుకోడానికి ఆరాటపడిపోతూ జీవితాన్ని మరింత యాతనామయం చేసుకునేవారికి ఒక సుస్థిరమైన సందేశం మన జీవితంలో ప్రతి నిమిషం మిమ్ము నన్నూ కూడా ఉద్బోధిస్తూంది.

నన్ను వినియోగించుకోండి ఉమ్మడిగా మీరు సాధనకు పూనుకుంటే వివేచన లేకుండా పెరిగిపోతూన్న యంత్రారాధనను విజయవంతంగా ఎదుర్కోగల దివ్య శక్తిగా పరిణమిస్తాను రకరకాలైన క్రొత్త ఫాషనులు, క్రొత్త ఆచారాలు, విధానాలు అనుసరించే స్త్రీ పురుషులకు నూలువడికే రాట్నం సాధనం గర్జిస్తుంది మాతృదేశం కోసమైనా ఇతర దేశపు అలవాట్లు, ఆచారాలను అనుసరించకండి. అవి మీకు ముప్పు తెచ్చి పెట్టక మానవు మీస్వధర్మాన్ని మీరు సంరక్షించుకోండి

"మానవులందరికీ సమానమైన గౌరవానికి,
హక్కులకు స్వాతంత్ర్యం ఉంది."
—యుఎన్ డిక్లరేషన్ ఆఫ్ రైట్స్

# అవీ - ఇవీ

## జేబులో ఇమిడే అగ్నిమాపక సాధనం

జేబులో ఇమిడే చిన్న పరిమాణపు అగ్నిమాపక సాధనం పశ్చిమ ఆసియా ఇజ్రెల్‌లో లభిస్తూంది. కేవలం 420 గ్రాములు తూగే ఈ సాధనంలో 200 గ్రాముల అగ్నిమాపక రసాయనిక పదార్థాలు ఉంటాయి. వీటిని సాధారణంగా కారులు, ఇతర వాహనాలలోను, నివాసగృహాలలోను, పరిశోధక కేంద్రాలలోను ఉపయోగించుకోవచ్చు.

* * *

## 32.2°C వద్దకూడా కరగని చాక్‌లెట్

యుఎస్ఎ ఓహియోలో బాట్టిల్లె మెమోరియల్ ఇన్‌స్టిట్యూట్‌లో అభివృద్ధి కావింపబడిన చాక్‌లేట్ 32 2° c మండువేసవిలో కూడా కరగదు. వీటిలో ప్రకృతిసిద్ధమైన యౌగిక పదార్థాలు (Compounds) ఉండడంచేత రిఫ్రిజిరేటర్స్‌లో నిల్వచేసే ఖర్చు ఉండదు. దీనివల్ల ఉష్ణ ప్రదేశాలలో చాక్లెట్ల వాడకం అధికం అవుతుంది

* * *

## చార్లీ చాప్లిన్ టోపీ, బెత్తం 1,54,200 డాలర్లకు అమ్ముడైంది

సుప్రసిద్ధ బ్రిటిష్ సినీమా నటుడు చార్లీ చాప్లిన్ తాను నటించిన 'దిగ్రేట్ డిక్టేటర్' లో ఉపయోగించిన టోపీ, బెత్తం 1987 లో లండన్‌లో 1,54,200 డాలర్లకు వేలం వేసారు అతడికి పెద్దవిగా ఉన్న ఒక జత షూలు 72,000 డాలర్లకు అమ్మారు

* * *

## ఆధునిక సాహిత్యంలో లిఖిత ప్రతికి అత్యధిక విలువ లభించింది

జ్యూయిష్ రచయిత ఫ్రాంజ్‌ఖాఫ్కా రచించిన 'ది ట్రయల్' లిఖిత ప్రతిని లండన్‌లో 1.98 మిలియను డాలర్లకు ప. జర్మనీ అధికారులు కొన్నారు. బహిరంగ ఏలంలో ఆధునిక సాహిత్యంలో లిఖితప్రతికి లభించిన ఈవెల మిక్కిలి అధికం

* * *

## మార్లిన్‌మన్రో అసలు నిద్రలేక బాధపడిపోయేది

సుప్రసిద్ధ హాలీవుడ్ సినీమానటి మార్లిన్‌మన్రో చాలాకాలం నిద్రపట్టక బాధపడేది. నరాలకి ఉపశాంతి కలిగి బాగా నిద్రరావడానికి ఈమె రోజుకు 20 ఫెనోబార్బిటాల్ (నిద్ర) మాత్రలు వేసుకునేది.

* * *

## బ్రిటన్ దేశపు మొట్ట మొదటి రాజు

ఎగ్‌బర్ట్ (827-839 A.D) బ్రిటన్ దేశపు మొట్ట మొదటి రాజు.

"ఆత్మ అనేది చచ్చేది కాదు, చంపబడేది కాదు, చంపేదికాదు."

## ఎయిర్ కండిషన్డ్ షూస్

యునువినో మొలెయర్స్లో అనే పోర్చుగీసు నవ్యకల్పనా చతురుడు పాదాలు చమటెక్కి వాసన కొట్టకుండా ఉండడానికి ఎయిర్‌కండిషన్డ్ షూస్ కనిపెట్టాడు. నడిచేటప్పుడు ప్రతీ అడుగుకి వాటంతట అవే తెరుచుకుని మూసుకునే వాల్వుల ద్వారా గాలి లోపలికి ప్రవేశిస్తూ బయటకు పోతూంటుంది. పాదాలు చెమటెక్కి వాసనకొట్టవు.

* * *

## ఆసియాలో సుకిందా లోయలో ముడిక్రోము గనులు

ఒరిస్సా సుకిందా లోయలో గనులలో అత్యధికంగా ముడిక్రోము లభిస్తుంది. మొత్తం లభ్య మయ్యే 144 మిలియను టన్నుల ముడి ఖనిజంలో స్వచ్ఛమైన క్రోము 49 మిలియను టన్నులు ఉంటుంది.

* * *

## అప్పు తీర్చేదాకా అప్పు తీసుకున్నవారి పేరు తాకట్టులో ఉంటుంది

కెనడా బ్రిటిష కొలంబియాలో క్వాకుయిట్ ఇండియనులు తమపేరును తాకట్టుపెట్టి దానిమీద అప్పు తీసుకుంటారు. అప్పు తీసుకున్న వారు సొమ్ము చెల్లించేదాకా పేరు లేకుండా ఉంటారు

* * *

## అంటార్కిటిక్ 100 శాతం అంతా నిర్మానుష్యమైన అడవులు

వివిధ ఖండాలలో అంటార్కిటిక్ 100 శాతం నిర్మానుష్యమైన అటవీ ప్రదేశం. అదే విధంగా ఉత్తర అమెరికాలో 35.5 శాతం,

క్విజ్-జవాబులు : 1. (డి) మధ్యప్రదేశ్, 2. (సి) 6 సంవత్సరాలు, 3. (డి) కలకత్తా, 4. (ఎ) బెనజీర్‌భుట్టో, 5. (సి) బార్సిలోనా, 6. (సి) అంటార్కిటికాలో భారతదేశపు పర్మనెంట్ సైంటిఫిక్ స్టేషన్ 7.(బి) హజారీబాగ్ (బీహార్), 8. (డి) విటమిను A.

తెలివికి పరీక్ష-జవాబులు :
1. సున్న 2. గొడ్రాలి కొడుకు, 3. తేడాలేదు 4. నీడపడడానికి ఆధారమైన కాంతినిబట్టి నీడ పరిమాణం ఉంటుంది. ఈ విమానాలకు ఆధారమైన సూర్యకాంతి 93,000,000 మైళ్ళ దూరంలో ఉంది. ఇంత దూరాన్నిబట్టి చూచి నప్పుడు 450 అడుగుల తేడాలవల్లనీడపరిమాణంలో కలిగే మార్పు లెక్కలోకి రాదు. 5. పదిమంది సభ్యులున్న నాలుగు పార్టీలు పాల్గొన్నాయి, 6. 'తారకమంత్రము కోరిన దొరికెను.'

మాటలమహిమ-జవాబులు : 1. చిత్రము (ఎ), అనురాగము (బి), కోర్కె (సి), అభిప్రాయము (డి), 2. ఎక్కువ పరిచయము (ఎ), వాత్సల్యము (బి), 3. క్షేమము (ఎ), మేలు (బి), శ్రేష్ఠము (సి), సులభము (డి), 4. వాక్యము (ఎ), లోకోక్తి (బి), హితోక్తి (సి), నిందావాక్యము (డి), 5. సామగ్రి (ఎ), సొమ్ము (బి), లక్ష్యము (సి), 6. సరసుడు (ఎ), గుణవంతుడు (బి), 7. తాకు (ఎ), ఆవేశించు (బి), దెబ్బ (సి), కష్టము (డి), 8. ధనము (ఎ), గొప్పహోదా (బి), సొలెవ్వరుగు (సి), గౌరవసూచకంగాను, శుభసూచకంగానూ వాడే పదము (డి)

"నదిలో ప్రయాణించేసేవారికి ఈత ముఖ్యం.
అదేవిధంగా నిత్యజీవితంలో సంసార సాగరం
దాటడానికి ఆత్మజ్ఞానం అవసరం."

ఆఫ్రికాలో 30 3 శాతం, ఆస్ట్రేలియాలో 29 9 శాతం, ఆసియాలో 27 2 శాతం, యూరప్‌లో 7 1 శాతం అటవీ ప్రదేశం

* * *

## నాలుగు చక్రాల మోటారు సైకిలు

నవ్యవస్తు కల్పనా చతురులైన జపానీయులు నాలుగు చక్రాల మోటారుసైకిలును రూపొందించారు క్రొత్త నాలుగు చక్రాల వాహనం రెండుచక్రాల దానికంటే స్థిరంగా ఉంటుంది అంతేగాక దీనికి అంత ఎక్కువ పెట్రోలు ఖర్చు అవదు

— 'మిషా' సౌజన్యంతో

* * *

## బ్రిటన్ దేశపు మిక్కిలి వృద్ధురాలు మరణించింది

వెల్స్‌లోని స్వాన్‌సీలో వృద్ధ శరణాలయం (హోమ్ ఫర్‌ది ఏజ్‌డ్) లో బ్రిటన్ దేశపు మిక్కిలి వృద్ధురాలైన అన్నా విలియమ్స్ 114 సంవత్సరాల వయస్సులో మరణించింది. ఈమె దీర్ఘకాలం జీవించడానికి ముఖ్యంగా తను ఎప్పుడూ సిగరెట్టు కాల్చలేదని, ఎక్కువగా కాయగూరలు తింటానని చెప్పింది

* * *

## 60,000 - 70,000 రెట్లు శక్తివంతమైన బాధానివారిణి

లక్నో సెంట్రల్ డ్రగ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో డా కెబి మాథుర్ పెప్‌టైడ్ కాంపౌండుల నుంచి తయారుచేసిన బాధానివారిణి ఔషధం ఎన్‌కెఫాలిన్ (Enkephalin) కంటె 60,000 70,000 రెట్లు అధిక శక్తివంతమైనది

* * *

## 100 రెట్లు ప్రతిధ్వనిస్తుంది!

ఐర్లండ్ (యూరప్) లో ఉన్న కిలార్నే ఈగిల్స్ నెస్ట్ గుహలో కేకవేస్తే అది 100 రెట్లు ప్రతిధ్వనిస్తుంది!

## దృష్టిదోషం గలవారికి 'మాగ్నిలింక్' సహకరిస్తుంది

దృష్టిదోషం వల్ల చూపు సరిగా ఆననివారికి ఆదునిక సాంకేతిక ప్రగతిలో ఉత్పాదింపబడిన మాగ్నిలింక్ (Magnilink) ఎలక్ట్రానిక్స్ సహాయంతో బొమ్మలు అక్షరాలు పెద్దవిగా చూపిస్తుంది ఒక ప్రత్యేక చేతి కెమెరా సహాయంతో నలుపు-తెలుపు టివి స్క్రీను మీద బొమ్మలు 3 మొదలు 40 రెట్లు పెద్దవిగా కనిపించేటట్టు చేస్తారు టైప్‌రైటర్‌కు ఈ కెమెరాను అమరిస్తే టైపుచేసిన అక్షరాలు టివి స్క్రీను మీద పెద్దవిగా కనిపిస్తాయి

* * *

## ప్రాచీన ఈజిప్టులో ఉల్లిపాయతో ప్రమాణంచేసేవారు

చాలా సంవత్సరాలకు పూర్వం యూరప్‌లో వధూవరులకు ఉల్లిపాయను బహుమానంగా ఇచ్చేవారు ఆనాడు వాటికి అమూల్యమైన విలువ ఉండేది. ప్రాచీన ఈజిప్టు ప్రజలు ప్రమాణం స్వీకరించడానికి ఉల్లిపాయను ఉపయోగించేవారు 5000 సంవత్సరాలకు పూర్వం ఈజిప్టియనుల సమాధుల లోపల ఉల్లిపాయ చిత్రాలను అలంకరించేవారు!

"శోక మోదాలు రెండూ ఆత్మను అంటనివి,
కాబట్టి వివేకుడు రెంటిని వదిలివేస్తాడు."

# భారతరత్నాలు

## రంజిత్ సిన్హ్‌జీ

విదేశాలలో ప్రసిద్ధి పొందిన మొట్టమొదటి భారతీయ క్రికెట్ క్రీడాకారుడు రంజిత్‌సిన్హ్‌జీ ఇతడు గుజరాత్ కతియవార్‌కు చెందిన నవ్‌నగర్‌లో ఒక రాజవంశంలో సెప్టెంబరు 10, 1872న జన్మించాడు రాజ్‌కోట్‌లో రాజ్ కుమార్ కాలేజీలో చదువుకుంటూ క్రికెట్ ఆసక్తితో ఆడటం ప్రారంభించాడు.



ఇతడు తన 21వ సంవత్సరం వయస్సులో, క్రికెట్ నైపుణ్యాన్ని ప్రదర్శించాడు అప్పుడు అతడు కేంబ్రిడ్జి యూనివర్శిటీలో విద్యార్థిగా ఉన్నాడు యూనివర్శిటీ 'బ్లూ'ను గెలుచుకున్నాడు. కేంబ్రిడ్జిలో ఆక్స్‌ఫర్డ్‌కు పోటీగా ఆడినప్పుడు మొట్టమొదట సెంచరీ గెలుచుకుని సమర్థవంతమైన బాట్స్‌మన్‌గా ప్రసిద్ధిపొందాడు.

మే 1895లో లార్డ్స్‌లో MCC కి పోటీగా సస్సెక్స్ కౌంటీకి ఆడి మొదటి ఇన్నింగ్సులో 77 పరుగులతో నాట్ అవుట్‌గా ఉండి, రెండవ ఇన్నింగ్స్‌లో 150 పరుగులు చేసాడు ఆనాటి నుంచి క్రికెట్‌లో మునుముందుకు పోసాగాడు. 1896 లో బ్రిటన్‌లో యార్క్‌షైర్ సస్సెక్స్‌ల మధ్య జరిగిన పోటీలో ఒకే ఆటలో రెండు ఇన్నింగ్సులో 125 నాట్ అవుట్ మరియు 180 పరుగులతో ఒకేరోజులో 2 సెంచురీలు చేశాడు.

1896 లో ఆస్ట్రేలియా పాల్గొన్న క్రికెట్ ఆటలో ఇంగ్లండ్ టీములో రంజిత్‌ని చేర్చుకున్నారు బాగా ఆడి ఇంగ్లండు రెండు ఇన్నింగులలో చేసిన మొత్తం 536 పరుగులలో 216 పరుగులు చేసి రంజీ క్రికెట్‌లో యోధుడుగా పరిగణించబడ్డాడు.

తరువాత సీజనులో ఒక ఇన్నింగ్సులో 260 పరుగులు, ఇంకొకసారి ఆస్ట్రేలియాతో మొదటి పందెంలో మొదటి ఇన్నింగ్సులో ఇంగ్లండుకు ఆడి 175 పరుగులు తీసాడు. రెండవ ఇన్నింగ్సు ఆడే అవసరంలేక పోయింది.

### జపాన్ పాపులేషన్ క్లాక్

ప్రపంచంలో జనాభా 5 బిలియను దాటిన వైనం తెలుసుకోడానికి యునైటెడ్ నేషన్స్ పాపులేషన్ ఫండ్‌వారు జపానువారు తయారుచేసిన పాపులేషన్ క్లాక్ సాధనోపాయాన్ని ఉపయోగిస్తున్నారు. ఈ సాధనోపాయంలో ఉండే మైక్రోచిప్ ప్రోగ్రాం ప్రపంచంలో ప్రతి నిమిషానికి పెరిగిపోతున్న జనాభాని అంచనావేసి గుర్తించడమేగాకుండా యునైటెడ్ నేషన్స్ సభ్యత్వాన్ని పొందిన 157 వివిధ దేశాలలో ఆశిస్తున్న జనాభివృద్ధిని కూడా గుర్తిస్తుంది.

"దూషణవల్ల కాదు, కనికరం వల్లే అధికంగా పాపాలు ఉపశమిస్తాయి."

1899 లో రంజీ ససెక్స్ టీముకు కాప్టెన్‌గా నియమింపబడ్డాడు 1904 వరకు ససెక్స్ కాప్టన్ పదవిలో ఉన్నాడు. ఇంగ్లీష్ కౌంటీ టీముకి కాప్టన్ పదవిని అధిష్టించిన మొట్ట మొదటి విదేశీయుడు ఇతడు తరువాత క్రమంగా నాలుగు సంవత్సరాలు అతివైభవంగా క్రికెట్ ఆడాడు ఆనాడు ప్రసిద్ధి చెందిన అయిదుమంది క్రికెట్ ఆటగాళ్లలో ఇతడు ఒకడు.

1901 ఆగస్టులో టాంటన్‌లో సోమర్‌సెట్‌తో ససెక్స్ తరఫున ఆడి అత్యధికంగా 285 పరుగులు చేసాడు. 1893 నుండి 1920 వరకు అన్ని మొదటి తరగతి పందాలలోను 500 ఇన్నింగులు ఆడి 62 సార్లు నాట్ అవుట్‌గా ఉండి ఒక్కొక్క ఇన్నింగ్సుకి సగటున 56.37 పరుగులు చొప్పున మొత్తం 24,690 పరుగులు చేసాడు. అప్పటికే అతడికి ఒక కంటికి చూపు పోయింది.

రంజీ ఇంగ్లండులో ఇంగ్లీషువారితోను, లేక ఇంగ్లీష్ నేషనల్ టీములో పాల్గొన్నాడు. భారత దేశంలో అప్పుడప్పుడు ప్రత్యేక ప్రదర్శనకి ఏర్పాటు చేసిన క్రికెట్‌లో పాల్గొనడంతప్ప భారతదేశంలో క్రికెట్ ఆటలో ఇతడు ఎక్కువగా పాల్గొనలేదు. అతడు మరణించడానికి ఒక సంవత్సరం ముందుగా 1932 లోనే భారత దేశానికి టెస్ట్ స్టేటస్ వచ్చింది. కాబట్టే అతడు భారతదేశం తరఫున ఆడలేకపోయాడు

1907 వ సంవత్సరం నుంచి నవ్‌నగర్ మహారాజాగా రంజిత్ సిన్హ్‌జీ ఒక ఆదర్శ ప్రభువుగా పేరుపొందాడు ఇతడి సంస్థానం చిన్నదైనా ఎంతో ప్రగతిని పొందింది

ఇతడు లార్డ్‌హాకీ, ఆర్చీ మాక్లారెన్, సి.బి ఫ్రై, విల్‌ఫ్రెడ్ రోడ్స్, వైన్ అండ్ కిల్లిక్ వంటి సుప్రసిద్ధ ఇంగ్లండ్ క్రికెట్ యోధులతో ఆడాడు. క్రికెట్ ఆటలో సమతను, శీఘ్రతను, చాకచక్యమైన నమ్రతను ప్రదర్శించాడు తీక్షణమైన దృష్టితో క్రికెట్ బంతి మార్గాన్ని గమనించేవాడు ఇతడి స్ట్రోకులు అత్యద్భుతంగా మెరుపులాగా ఉండేవి బౌండరీలోకి బంతిని అతి నైపుణ్యంగా ఎగురగొట్టేవాడు ఆఫ్‌బ్రేకులు, ఇన్‌స్వింగర్లు మొదలైనవాటిని అతి తేలికగా నిగ్రహించేవాడు గొప్ప క్రికెట్ యోధుడైన రంజిత్ జాతీయ పతాకాన్ని విదేశాలలో ఎగురవేశాడు

రంజిత్ సిన్హ్‌జీ ఏప్రిల్ 2, 1933న జామ్ నగర్‌లో మరణించాడు. ఆనాటికి అతడి వయస్సు 61 సంవత్సరాలు. 1934 లో భారత దేశంలో అతడి జ్ఞాపకార్థం రంజీ ట్రాఫీ ప్రారంభింపబడింది. ●

## కష్టపడితేనే సంతోషం



విజ్ఞానం సంపాదించుకోవాలంటే కష్టపడి ప్రయత్నించాలి. సంతోషం పొందాలంటే దానికోసం కష్టపడాలి. కష్టపడటం ధర్మం. సంతోషం కష్టంవల్ల లభిస్తుంది. బద్ధకంవల్ల, సోమరితనంవల్ల, మమకారం వల్ల లభించేదికాదు. ఎవరైతే ఏధ్యేయ కర్తవ్యాన్ని అనుసరించడానికి జీవితాన్ని అంకితం చేసుకుంటారో వారి జీవితాలు ఆనందదాయకంగా ఉంటాయి.

"పరమాత్మ జ్ఞానం పుస్తకాలలో లభించేది కాదు.
ఆత్మావగాహన వల్లే అబ్బుతుంది."

# మన శరీరంలో ఎముకలు - వాటి వింతలు

డా. కె. చంద్రన్
(ఆర్థోపెడిక్ సర్జన్, మద్రాసు)

మన శరీరానికి స్థూలమైన ఆకారాన్ని కల్పించేవి ఎముకలు ఈ ఎముకలు విడి విడిగా ఉంటే మనం బ్రతకడమే సాధ్యం కాకపోయేది. ప్రతీ ఎముక మరో ఎముకతో కలిసి ఉంటుంది. ఇలా ఎముకలన్నీ కలిసి స్థూలంగా శరీరం ఆకారంలో ఉంటాయి. ఈ ఎముకల సమ్మేళనమే అస్థిపంజరం



ఉజ్జాయింపుగా మానవశరీరభారంలో పాడవవంతు ఎముకలది. మన శరీరంలో అనేకరకాల ఎముకలు సుమారు 206 ఉన్నాయి మిక్కిలి పెద్ద ఎముక ఫెమర్ (Femur) అనే తొడ ఎముక మిక్కిలి చిన్న ఎముకలు లేక పొట్టిగా ఉండే ఎముకలు మధ్యచెవిలో శబ్దప్రసారానికి ఉపయోగపడే చిన్నచిన్న ఎముకలు, తరువాత కాలి మరియు చేతివ్రేళ్ల ఎముకలు. వీటినే ఫాలెంజెస్ (Phalanges) అంటారు. బలిష్ఠమైన ఎముక తొడ ఎముక. మిక్కిలి బలహీనమైన ఎముక ఫిబ్యులా అని చెప్పబడే కాలిలో ముందరి ఎముక

సెసమోయిడ్స్ అనే చిన్నచిన్న తేలే ఎముకలు కండరాలలోను, టెండాన్స్‌లోను ఉంటాయి ఇది ఆధారం (Fulcrum) గా పనిచేస్తుంది. దీనికి మంచి ఉదాహరణ మోకాలి చిప్ప లేక పాటిల్లా (Patella). వివిధ టిస్యూలను చేర్చి ఉంచుటకు ఏర్పడినదీ ఎముక. దీనిలో 30 శాతం సేంద్రియపదార్థము, 45 శాతం ఇన్ ఆర్గానిక్ పదార్థము, 25 శాతం నీరు. సేంద్రియ పదార్థము అస్థికణజాలము. ఎముకలలో ఇన్ఆర్గానిక్ పదార్థాలు ముఖ్యంగా కాల్షియం, మరియు భాస్వరం. మానవ శరీరంలో 99 శాతం కాల్షియం, 90 శాతం భాస్వరము, ఎముకలలో ఉండి నిరంతరం శరీరంలో ప్రసరిస్తూంటాయి

అవసరమైనప్పుడు ఒకచోట ఉన్న ఎముకలను తీసి మరోచోట పెడతారు. దీనినే ట్రాన్స్‌ప్లాంట్ చేయడం అంటారు శరీరంలో ఒక భాగం నుంచి మరోభాగంలో ట్రాన్స్‌ప్లాంట్ చేయడం, ఒక మనిషి నుంచి మరో మనిషికి ట్రాన్స్‌ప్లాంట్ చేయడం, లేక జంతువుల నుండి మనుషులకు ట్రాన్స్‌ప్లాంట్ చేయడాన్ని వరుసగా ఆటోలోగస్, హొమోలోగస్, హెటిరోలోగస్ ట్రాన్స్‌ప్లాంటేషన్ అంటారు. సాధారణంగా పెల్విక్ కావిటీ (తుంటి ఎముక వల్లం) నుంచి, ప్రక్క ఎముకలనుంచి, కాలి ముందు భాగంలో ఉండే ఫిబ్యులా నుండి ఎముకలను తీస్తారు విరిగిన ఎముకలు వివిధ రకాల ఇంప్లాంట్స్‌తో చేర్చబడతాయి. ముఖ్యంగా స్టెయిన్‌లెస్‌స్టీల్, కోబాల్ట్, క్రోమియం, మాలిబ్డినమ్ మొదలైనవాటితో ఇంప్లాంట్స్ తయారు కాబడతాయి ఒక్కొక్కప్పుడు బోన్ కాన్సర్ రోగులకు

"మంచిపనులు చేయడానికి ప్రతిక్షణం పవిత్రమే."

ఎముకలలో మజ్జ కూడా ట్రాన్స్‌ప్లాంట్ వేయబడుతుంది.

ఎముకల పొడవు పుట్టుకనుబట్టి ఉంటుంది. తల్లి గర్భంలోనే ఎముకలకు రోగాలు సంభవించవచ్చు. లేకపోతే పుట్టిన తరువాత పెరుగుతూన్నప్పుడు కూడా ఎముకల జబ్బు రావచ్చు. పుర్రె ఎముకలు లోపల మెదడు (సర్వాధికారి) ను రక్షిస్తాయి ప్రక్క ఎముకల గూడు ముఖ్యంగా ఊపిరి తిత్తులను, గుండెను రక్షిస్తుంది పొత్తికడుపు క్రింద తుంటిలో మూత్రాశయాలు, జననాంగాలు ఉంటాయి.

మజ్జ అనేది ఎముకల లోపల ఉండే మెత్తటి పదార్థం ఇది రక్త కణాలను అభివృద్ధి చేస్తుంది. కాబట్టి మానవుని ఆరోగ్యం, రోగ నిరోధకశక్తి ముఖ్యంగా ఎముకలమీదే ఆధారపడి ఉంటుంది.

ఎముకల విశిష్టత పుట్టుక, వంశము, ఆహారము, వ్యాయామమును అనుసరించి ఉంటుంది. యూరప్, అమెరికా వంటి పశ్చిమ దేశాలలో నివసించేవారు ప్రోటీన్లు, కాల్షియం ఎక్కువగా తింటారు కాబట్టి వారి ఎముకలు చాలా బలిష్ఠంగాను, లావుగాను ఉంటాయి.

మనకు వృద్ధాప్యం సమీపిస్తూన్న కొద్దీ ఎముకలు శిథిలం అయిపోతాయి ఎనబాలిజం, కెటబాలిజంలను అనుసరించి వయస్సు గడుస్తున్నకొద్దీ ఎముకలు, బలహీనమైపోతాయి ఉత్సాహవంతులైన వారి శరీరంలో నూరు సంవత్సరాల వయస్సులో కూడా ఎముకలు బలిష్టంగానే ఉంటాయి.

ముఖ్యంగా ఆయా ఎముకలలో గ్రోత్‌ప్లేట్స్ అనే ప్రవర్థక కవచాలు పెరుగుదలను కలిగిస్తాయి. అవి ఎముకలలో ప్రత్యేక వయస్సులో ఏర్పడుతుంటుంది. దీనిని బట్టి వైద్యులు మానవుని వయస్సు తెలుసుకో గలుగుతారు. మన భుజం వెనుక ఒలిక్రనాన్ ఎపిఫైసిస్ సాధారణంగా పదవ ఏట కనిపిస్తుంది మోచేతి పైవైపు లేటరల్ కోన్‌డైల్ 12వ సంవత్సరంలో ఏర్పడుతుంది. ఒక బాలుని X రే ఫొటోలో ఒలిక్రనాన్ ఎపిఫైసిస్ కనిపించి కోన్‌డైల్ కనిపించకపోయినప్పుడు బాలుని వయస్సు 10-12 సంవత్సరాల మధ్య ఉంటుంది.

శరీరంలో ఏ ఇతర శరీరభాగం కంటే ఎముకలు గట్టిగాను, బలిష్టంగాను ఉంటాయి ఎముక విరిగిపోయినప్పుడు ఫ్రాక్చర్ ఏర్పడింది అంటారు ప్రత్యేకమైన కాలస్ (Callous) టిస్స్యూ పొరవల్ల ఇది కుదురుతుంది. పెద్దవారిలో ఎముక పూర్తిగా విరిగిపోతుంది దీనిని కంప్లీట్ ఫ్రాక్చర్ అంటారు. పిల్లలలో పెద్ద ఎముకలలో పుటాకారపు పైభాగం విరిగిపోతుంది. దీనిని గ్రీన్‌స్టిక్ ఫ్రాక్చర్ అంటారు.

శరీరంలో ఇతర అంగాల వలెనే ఎముకలకు కూడా పుట్టుకలోనే లోపాలు సంభవిస్తాయి అంటురోగంవల్ల, పోషకాహార లోపంవల్ల, ముసలితనంవల్ల ఇవి ఏర్పడటం సహజం. ముఖ్యంగా పుట్టుకలోనే కల్గేలోపం కుక్డ్‌ఫుట్ లేక క్లబ్‌ఫుట్ అంటారు ఎముకకు

## జపాన్‌లో పాఠకులు అత్యధికం

గత 7 సంవత్సరాలలో ప్రతి సంవత్సరం 1000 మిలియనుకు పైబడిన పుస్తకాలు, మాగజైన్లు చదివిన జపాన్ పాఠకలోకం ప్రపంచంలో అత్యధికం. 1985 వ సం||లో వారు రోజుకి 48 మిలియను వార్తాపత్రికలు కొన్నారు. 121 మిలియను జనాభా గల జపాన్‌లో సుమారు ఒక శాతం నిరక్షరాస్యులు. 1987 లో వీరు 4,010 మిలియను మాగజైనులు, 1,450 మిలియను పుస్తకాలు ప్రచురించారు.

"ప్రార్థనలు చేసే పెదవులుకన్నా సహాయం చేసే చేతులు పవిత్రమైనవి."

— మదర్‌థెరీసా

సంబంధించిన అంటురోగాన్ని ఓస్టియోమైలిటిస్ అంటారు. విటమిన్ D లోపంవల్ల రికెట్స్ సంభవిస్తాయి (పిల్లలలో ఎముకలు మెత్తబడిపోయి వంగిపోవడం) ఈ ఎముకలు వయస్సుచే ముదిరి పోవడాన్ని "సెనైల్ ఓస్టియోపోరోసెస్'' అంటారు ఊపిరితిత్తుల కాన్సర్ మరియు స్త్రీల స్తనముల కాన్సర్‌లతో సరిపోల్చినప్పుడు ఎముకల కాన్సర్ సంభవించడం చాలా తక్కువ ఒక ఎముకల కాన్సర్ తప్ప ఇతర కాన్సర్ రోగాలు 40 సంవత్సరాల వయస్సు దాటిన తరువాతే వస్తాయి ఎముకల కాన్సర్ మాత్రం బాల్యంలోనే చంపేస్తుంది.

వచ్చే కొద్దిఏళ్లలో ఎముకలకు సంబంధించిన శస్త్రచికిత్స ఎంతో పురోభివృద్ధి చెందగలదని ఆశించబడుతూంది ఇప్పుడు పూర్తిగా తుంటి కీలు, మోకాలి కీలు వంటి కీళ్లు కొన్ని మాత్రమే మార్చబడుతున్నాయి ఇవి ముఖ్యంగా ఎక్కువ బాధతో కూడిన కీళ్లరోగం (ఆర్థిరైటిస్) లకు మాత్రం అనుసరించబడుతూంది.

ఇకమీద శరీరంలో అన్ని కీళ్లు కూడా మార్చడానికి వీలు కలుగుతుంది. కృత్రిమ పదార్థాలతో తయారైన కీళ్లేగాక అపాయాలకు గురై మరణించినవారి కీళ్లు, ఇతర జంతువుల కీళ్లు మొదలైనవి బోన్‌బాంక్‌లలో నిల్వచేయబడి కీళ్ళ మార్పిడి చికిత్సకు ఉపయోగకరంగా ఉంటాయి.

ఆర్థ్రోస్కోప్ ఇప్పుడు మోకాళ్ల కీళ్ల పరీక్షలకు మాత్రమే ఉపయోగపడుతూంది. ఇకముందు వెన్నెముక, వెన్నుపూస మొదలైన వాటినన్నిటినీ దీనితో పరీక్ష చేయగలుగుతారు విరిగిపోయిన ఎముకలు శీఘ్రంగా అతుక్కోవడానికి లేక పెరుగుదలను శీఘ్రపరచడానికి ఎలక్ట్రిక్ స్టిములేషన్‌గానీ, అయస్కాంత క్షేత్రంగానీ సాధ్యపడుతుంది

పుట్టుకలో ఉండే జన్యు సంబంధమైన లోపాలను అనుసరించి వ్యక్తి ఎత్తును కూడా ఇకముందు మార్చడానికి వీలు కలుగుతుంది. ట్యూమర్‌వల్ల లేక అంటురోగంవల్ల ఎముకలు చెడిపోయి ఖాళీలు ఏర్పడినప్పుడు ఖాళీలను భర్తీ చేయడానికి ఇప్పుడు హైడ్రాక్సీ ఎపటైల్ స్ఫటికాలు లభిస్తున్నాయి. ఇవి ఎముకలలో పెట్టినప్పుడు దీనిని ఎముక మెల్లిగా వినియోగించుకుంటుంది ఇకముందు పైచర్మంగానీ, కండరాలుగానీ ముట్టకుండా నేరుగా ఎముకలలోకి ఔషధాలను ఇంజక్ట్ చేయడానికి సాధ్యపడుతుంది.

ప్రస్తుతం శస్త్రచికిత్సలో ఉపయోగిస్తున్న లేసర్ కిరణంవల్ల వైద్యులకు అనేక లాభాలు ఉన్నాయి. దీనివల్ల రక్తం స్రవించదు మచ్చ ఏర్పడదు. వివిధ సంక్లిష్టమైన ఎముకల నిర్మాణానికి, కీళ్ల నిర్మాణానికి అభివృద్ధి పొందిన దేశాలలో బయోఇంజనీరింగ్ ప్రయోగపూర్వకంగ ఉపయోగిస్తున్నారు

ఎముకలకు సంబంధించిన వివిధ రోగాలను తెలుసుకోడానికి బోన్‌స్కానింగ్, ఎలక్ట్రిక్ మరియు మాగ్నటిక్ సాధనాలు ఇకముందు ఎక్కువగా ఉపయోగపడతాయి అనడంలో ఆశ్చర్యంలేదు. విరిగిన ఎముకలను అంటించడానికి బోన్‌గ్లూ కూడా సాధ్యపడ గలదు ●

## ప్రపంచంలో మొట్టమొదటి ఫాస్ట్ రియాక్టర్

బ్రిటన్‌లో డౌన్‌రే ఫాస్ట్ రియాక్టర్ ప్రపంచంలో అత్యధిక శక్తి వినియోగంతో విద్యుత్తును జనింపచేసిన మొట్టమొదటి అటామిక్ రియాక్టర్. 1963 లో ఇది 60 మెగావాట్స్ (ఉష్ణం) వద్ద పనిచేస్తూ ప్రజోపయోగానికి మొట్టమొదట విద్యుత్తును జనింపచేసింది.

"కొండెములు చెబుతూంటే వినేవాడికి, చిడుం పట్టిన వాడికి వేడినీళ్లు పోసుకుంటూన్నట్టు చాలాసుఖంగా ఉంటుంది.''

# బెయ్‌కాల్ సరస్సు

ఎస్. ఎసమనోవ్

సోవియట్ యూనియన్ సెంట్రల్ సైబీరియాలో బెయ్‌కాల్ మంచినీటి సరస్సు ప్రపంచంలో అన్ని సరస్సులకంటే మిక్కిలి లోతైనది. దీని ఉపరితలం వైశాల్యం 31,500 చ.కి.మీ. బెల్జియం మొత్తం వైశాల్యంకంటే కొద్దిగా తక్కువగా ఉంటుంది. దీని లోతు 1620 మీటర్లు. సోవియట్ యూనియన్‌లో



మొత్తం మంచినీటి వనరులలో 80 శాతం అంటే సుమారు 23,000 ఘన కిలోమీటర్ల మంచినీరు ఇందులో ఉంటుంది.

బెయ్‌కాల్ సరస్సు ఈ చివరనుంచి ఆ చివరకు మాస్కో మరియు లెనిన్‌గ్రాడ్ మధ్య ఉన్నంత దూరం ఉంటుంది. దీని అతి ఎక్కువ వెడల్పు 80 కి.మీ లు. అతి తక్కువ వెడల్పు 19 కి.మీలు. సరస్సులో దగ్గర దగ్గర 30 పెద్ద పెద్ద రాతి ద్వీపాలున్నాయి. వాటిలో ఓక్‌హాన్ (Olkhon) ద్వీపం ఒక్కటే 7,000 చ.కి.మీటర్లు ఉంటుంది. ఇతర ద్వీపాలు చిన్న చిన్నవిగా నిర్మానుష్యంగా ఉంటాయి.

దీనిచుట్టూ ఉండే ఆరు అఖాతాలు (bays) దీనిని విపరీతమైన పెనుగాలుల నుండి రక్షిస్తాయి ఇక్కడ గాలి అత్యధికం సెకండుకి 40 మీటర్ల వేగంతో వీస్తుంది. సర్మానదీ ముఖద్వారం దగ్గర గాలివేగం సెకండుకి 60 కి.మీ.ల దాకా ఉంటుంది. సాలీనా 18 మొదలు 148 గాలివాన రోజులు 20 తుఫాను గాలులు వీస్తుంటాయి. సుప్రసిద్ధమైన నల్లసముద్రం కంటే బెయ్‌కాల్ సరస్సు తీరంలో ఎండకాసే రోజులు అధికం. ఇది

## ప్రపంచంలో దీర్ఘకాలం జీవించిన వయోవృద్ధుడు

దక్షిణ అమెరికా కొలంబియాలో జవీర్ పెరీరా అనే జెనుఇండియన్, (Zenu Indian) ప్రపంచంలో మిక్కిలి దీర్ఘకాలం జీవించిన వయోవృద్ధుడు. ఇతడి అయిదుగురు భార్యలు, పిల్లలు, మనుమలు అందరూ గతించారు. ఇతడు 1789 లో జార్జివాషింగ్‌టన్ యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడైనప్పుడు జన్మించాడు.

1800-1900 మధ్య జరిగిన విషయాలను వివరంగా చెప్పేవాడు. అనేకమంది ఇండియనులు తాము చిన్న పిల్లలుగా ఉంటున్నప్పుడు జవీర్ ముసలి అధికారిగా ఎరుగుదుమని చెప్పేవారు. వారి తాతలకు కూడా జవీర్ తెలుసు. న్యూయార్క్ (యుఎస్ఎ) లో కార్నెల్ మెడికల్ సెంటర్ జవీర్ వైద్య పరీక్షలు చేయించుకున్నాడు. అక్కడ వైద్యులు ఇతడు చాలా చాలా వృద్ధుడని చెప్పారు.

కొలంబియా మాంటీరియాలో ఇతడు నిర్బంధంగా జీవించేవాడు. ఇతడి జీవితంలో ఒత్తిడి అనేది లేదు. వరిఅన్నం, కాయగూరలు, పళ్లు మాత్రమే ఇతడి ఆహారం. ఇతడు మరణించినప్పుడు ఇతడి వయస్సు 166 సంవత్సరాలు!

"భూమిమీద శాంతి నశించిన తరువాత అంతరిక్షంలో శాంతి మనకెంతమాత్రం సహకరించదు."

— కెనడీ

మిక్కిలి చలిగా ఉండే సైబీరియాలో ఉంది అనేది జ్ఞాపకం పెట్టుకోవాలి

25 మిలియను సంవత్సరాలకు పూర్వమే బెయ్‌కాల్ సరస్సు ఏర్పడినప్పటికీ అంత పురాతనంగా కనిపించదు. అంతేగాక భూబౌతిక శాస్త్ర సంబంధమైన విషయాలను బట్టి పరిశీలిస్తే సరస్సు సంవత్సరానికి రెండు సెంటీమీటర్లు విస్తరించుకుంటూంది. ఈవిధంగా కొంతకాలానికి ఇక్కడ గొప్ప మహాసముద్రం ఏర్పడవచ్చుని భూగర్భ శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

అసలు మొట్టమొదట బెయ్‌కాల్ సరస్సు ఆసియాఖండంలో ఒక చిన్న రేవుగా ఉండేది. ఈ చిన్న రేవు రానురాను విస్తరించుకుని పెద్ద సరస్సుగా మారింది.

ప్రపంచంలో 2,600 వివిధరకాల జంతువులతో, వృక్షసంపదతో తులతూగుతూ ఉండే బెయ్‌కాల్‌కు సరిసమానంగా ఉండే మరో సరస్సు ఇంకొకటి లేదు. సుమారు మూటికి రెండువంతులు ఇక్కడ ఉండే వృక్షసంపద మరెక్కడా ప్రపంచంలో కనిపించదు.

బెయ్‌కాల్ సరస్సులో సాలీనా 60 ఘనకిలోమీటర్ల అపూర్వమైన సాటిలేని స్ఫటికం వంటి మంచినీరు లభిస్తుంది. దీంట్లో అనేక లవణాలు, ఖనిజాలు చేరి ఉంటాయి. సాధారణంగా దీంట్లో ఉండే బయోటా (ప్లాంక్‌టానిక్ సూక్ష్మ జీవులు, నాచు) లో ప్రాణవాయువు అధికంగా ఉంటుంది. బెయ్‌కాల్ సరస్సులో నీరు అన్ని చోట్ల పైన, మధ్య, క్రింద అంతా ప్రాణవాయువుతో కలిసి ఉంటుంది.

ఇటువంటి మహాద్భుతమైన సరస్సును సంరక్షించుకోడం మన కర్తవ్యం.

—సైన్స్ ఇన్ ది యుఎస్ఎస్ఆర్'

సౌజన్యంతో

# మూత్రపిండాలలో 2 మిలియను 1 1/2 అంగుళం పొడవుగొట్టాలు



KIDNEYS

కేవలం చేతి ముష్టి పరిమాణంలో ఉండే కిడ్నీలలో ముట్టుకుపోయి మెలితిరిగిపోయి 1 1/2 అంగుళం పొడవు గొట్టాలు 2 మిలియను పైబడి ఉంటాయి. శరీరానికి అవసరమైన నీరు మరియు ఇతర లవణాలకు ఈ 140 మైళ్ళ గొట్టాలు సహాకరించాలి. ప్రతీ గొట్టం కూడా ఒకరోజుకి శరీరభారానికి 10 రెట్లు అధిక భారంగల నీటిని, లవణాలను వడకడుతుంది. ఈవిధంగా మొత్తం 300 లీటర్ల ద్రవం ఏర్పడుతుంది. దీంట్లో అమూల్యమైన ద్రవాలు, లవణాలు కలిసి ఉన్న 299 లీటర్ల ద్రవాన్ని తిరిగి శరీరం గ్రహిస్తుంది. కిడ్నీలు నిరంతరం పనిచేస్తూనే ఉంటాయి. ఒక కిడ్నీతో అరభాగంతో కూడా మానవుడు జీవించగల సామర్థ్యత దీనికి ఉంది. ఇట్టి వడపోత సాధనం ఎలా పనిచేస్తుందో ఒకసారి ఆలోచించండి. అటువంటి నమ్మకమైన మరియు సంక్లిష్టమైన సాధనాన్ని రూపొందించాలంటే మన సాంకేతిక విజ్ఞానం ఎంత అభివృద్ధి పొంది ఉండాలో!

— 'యోగా' సౌజన్యంతో

"నలుగురికి ఉపకారం చేసే అవకాశం ఉన్నవారి చెవులు కొరుకుతుంటారు స్వప్రయోజనాపరులు."

# వసంతకాలపుపక్షి - కోకిల

డా॥ జె.ఎస్. యాదవ్

ఒక ప్రత్యేక ప్రదేశం అంటూ లేక భారత దేశం అంతటా స్థానికంగా వలసలు పోతూండే పక్షి కోకిల. అనేకచోట్ల వేసవికాలపు పక్షిగాను, దక్షిణదేశ ప్రదేశాలలో శీతాకాలపు పక్షిగాను ప్రసిద్ధిపొందిన కోకిల చెట్లతో నిండిన పెద్దపెద్ద తోటలలోను, మామిడి తోటలలోను, మనిషి సంచారం ఉండే ప్రదేశాల లోను నివసిస్తూంటుంది.




సామాన్యులందరూ యుడినామిస్ స్కోలోపాసియా ( Eudynamys Scolopacea) అనే కోకిలను ఆడజాతికి చెందిన పక్షిగా భావిస్తారు. కానీ నిగనిగలాడే నల్లటి రెక్కలు, పసుపు రంగు ముక్కు, ఎరుపురంగు కళ్లు 'కెడుకెడూ' అంటూ అరిచే పక్షి మగపక్షే

రెక్కలు వచ్చిన వెంటనే గూటిని విడిచిన తరువాత కోకిల భూమిమీద తరచు కనిపించదు. సాధారణంగా చెట్లమీద, కొమ్మల చాటున, దట్టమైన ఆకులమాటున నిశ్శబ్దంగా కూర్చుంటుంది. వేసవికాలం ప్రారంభంలో పిల్లలను పెట్టే సమయంలో కోకిల బిగ్గరగా ఉచ్చస్వరంతో కూయడం ప్రారంభిస్తుంది. సూర్యోదయంతో ప్రారంభించి ప్రొద్దుపోయేదాకా అతి మధురంగా కూస్తూంటుంది.

వీటి పిలుపులు మూడు విధాలుగా విని పిస్తాయి. మొట్టమొదట సూర్యోదయానికి ముందే మగ కోకిల అతి బిగ్గరగా "కెడూ కెడూ కెడూ కెడూ కెడూ కెడూ" అంటూ ఆరుసార్లు లేక ఏడుసార్లు స్వరంలో ఏ మార్పులేకుండా ఒకే విధంగా కూస్తుంది. తాను అక్కడ ఉన్నట్టు తన ఉనికి, తన గొప్పతనం ఇతర పుంజులకు ప్రకటిస్తుంది. ఈ కూతవిని పోటీగా ఇతర మగపక్షులు కూయడం ప్రారంభిస్తాయి సూర్యుడు పైకి లేచి ఎండ ఎక్కుతున్నకొద్దీ ఈ కూతలు తగ్గుతాయి 'కుడూ కుడూ' అంటూ ఒక్కొక్క నిమిషం విరామంతో పాట ప్రారంభమవు తుంది. జతకూడే సమయంలో పుంజు తరుము తూన్న పెట్ట కోకిల 'కిక్-కిక్-కికొ' అనే సాధారణ కూత వినిపిస్తుంది. అయితే వాటిని పెంచిన కాకు లులాగ పిల్లకోకిలలు 'కాకా' అంటూ అరుస్తాయి.

## ప్రచారం చేసుకునేవాడు ఆత్మహత్య చేసుకోడు

విప్లవయోధుడని చెప్పుకునే ఒక యువకుడు ఒకసారి సర్దార్ పటేల్ అంతరంగిక కార్యదర్శి అయిన కాంతిలాల్‌షా దగ్గరకు వచ్చి తనను పటేల్‌తో వెంటనే సమావేశానికి ఏర్పాటు చేయమని లేకపోతే ఆత్మహత్య చేసుకుంటానని చెప్పాడు.

కాంతిలాల్ భయపడి పటేల్ దగ్గరకు వెళ్లి ఆ యువకుని సంగతి చెప్పి సందర్శనానికి అనుమతి ఇమ్మన్నాడు. దానికి పటేల్ 'వెళ్లి ఆత్మహత్య చేసుకోమని చెప్పు. భయపడకు. వాడు అసలు ఆత్మహత్య చేసుకోడు. బుద్ధిపూర్వకంగా ప్రచారం చేసుకునేవాడు ఎవడూ ఆత్మహత్య చేసుకోడు' అని చెప్పి పంపాడు.

"జీవితం కొండ ఎక్కడం వంటిది. ఒక కొండ ఎక్కితే మరో శిఖరం కనిపిస్తుంది. దూరంగా ఇంకో కొండ ఉంటుంది."

తీయని పండ్లను ఆశించే కోకిలలు తరచు సంపులు గుంపులుగా చేరి సాధారణంగా మర్రి, రావి, అత్తి, బెర్, మల్బరీ, యూకలిప్టస్ చెట్లమీద పళ్లు తింటూంటాయి చిన్న చిన్న కీటకాలు, పురుగులు, గొంగళిపురుగులు, చిన్నచిన్న పక్షులగ్రుడ్లు, పువ్వులు, పువ్వులలో మధురమైన తేనె వీటికి ఆహారం.

ఒక మగపక్షి తాను ఉన్నచోట మరో మగ పక్షిని చేరనీయదు పెట్టమాత్రం ఒకేపుంజును అంటిపెట్టుకు ఉండదు. అనేక పుంజులతో వెడుతూంటుంది.

కోకిల గ్రుడ్లు కాకి గ్రుడ్లులాగే ఉంటుంది సాధారణంగా అడవి కాకులు గూటిలో రెండు మూడు గ్రుడ్లు పెట్టిన తరువాత కోకిల తన గ్రుడ్లను అందులో పెడుతుంది ఈ విషయం పూర్వం ఎప్పుడో కాళిదాసు తన కావ్యాలలో సూచించాడు

అతి నైపుణ్యంగా, చాకచక్యంతో, అవకాశానికి అనుగుణ్యంగా గ్రుడ్లను కాకి గూటిలో పెట్టడానికి మగకోకిల ఆడకోకిలకు అన్నివిధాలా సహకరిస్తుంది. ఆశపెట్టి కాకిని గూటినుంచి పైకి వచ్చేటట్లు చేస్తుంది. ఇంతలో ఆడకోకిల నిర్భయంగా గ్రుడ్లను కాకి గూటిలో పెట్టేస్తుంది.

సుప్రసిద్ధ ఆర్నిథాలజిస్ట్ (పక్షులపరిశోధకుడు) సలీమ్ ఆలీ పరిశీలించి ఒక కాకి గూటిలో 13 గ్రుడ్లుదాకా ఉన్నట్లు గ్రహించాడు ఒకే కోకిల గాక రెండు మూడు కోకిలలు వీటిని పెట్టి ఉండవచ్చు. సాధారణంగా కాకి గూటిలో కాకి గ్రుడ్లు, కోకిల గ్రుడ్లు చేరి ఉంటాయి.

కాకి గ్రుడ్లు పెరగడానికి 16-20 రోజులు పడితే కోకిలగ్రుడ్లు 13-14 రోజులకే పొదగబడతాయి. కాకులు తెచ్చిన తిండి కోకిల పిల్లలకు వినియోగం అయిపోతుంది కాకి పిల్లలు పస్తుండవలసివస్తుంది. గూటిలో బ్రతికిన పిల్ల కోకిలలు కాకి పిల్లలను గూటి నుంచి బైటికి తరిమేస్తుంటాయి ఒక్కొక్కప్పుడు రెక్కలు వచ్చి గూటిని వదిలేదాకా రెండూ ఒకే గూటిలో పెరుగుతాయి. గూటి వెలుపల తల్లికోకిల తన పిల్లలకు ఆహారం పెడుతూంటుంది ●

## భగవంతుడు సంఖ్య 'ఒకటి' మిగిలిన ప్రాపంచిక వస్తువులు 'సున్న'లు



భగవంతుని లక్ష్యంగా పెట్టుకొని ఆ భగవంతుని సాక్షాత్కరింపచేసుకోడానికి ప్రయత్నాలు కొనసాగించే వారు ఎంత ధన్యులో సున్నాలకు విలువ లేదు. కానీ ఈ సున్నాలను ఒకటి ప్రక్కన చేరుస్తూ దాని విలువను ఎంత పెద్దగానైనా పెంచవచ్చు. ఆ ఒకటిని కొట్టివేస్తే సున్నల విలువ సున్న. సర్వాంతర్యామియగు పరమాత్ముడు సంఖ్య ఒకటి వంటి వాడు. ఇతర భౌతిక వస్తువులన్నీ సున్నలవలె లోకంలో అన్నింటికీ భగవంతునితో ఉండే సంబంధము చేతనే విలువ ఏర్పడుతుంది. ప్రపంచానికి ఆధారభూతుడైన భగవంతుని ఆశ్రయించినప్పుడు సున్నలకు విలువ ఏర్పడుతుంది.

శ్రీరామకృష్ణుడు

"విద్య యొక్క ముఖ్య ఉద్దేశ్యము సత్యాన్ని తెలుసుకోడానికి కాదు. సత్యాన్ని అనుసరించి జీవించడానికే."

# మీకు తెలుసా?

## అతి ప్రాచీనమైన 'సైంటిఫిక్ సొసైటీ'

ప్రకృతి సిద్ధమైన విజ్ఞానాభివృద్ధి కోసం ఏర్పడిన ది రాయల్ సొసైటీ ఆఫ్ లండన్ అతి ప్రాచీనమైన సైంటిఫిక్ సొసైటీ. ఇది 1660 లో స్థాపించబడింది.

* * *

## *గుర్రానికి 18 జతల ప్రక్క ఎముకలు*



మనిషికి 12 జతల ప్రక్క ఎముకలు ఉంటే గుర్రానికి 18 జతలు ఉన్నాయి.

* * *

## 'A' నగరం!

'A' యూరప్ స్వీడెన్‌లో ఒక నగరం పేరు.

* * *

## సీల్ నీటిలో 600 అడుగుల లోతుకు డైవ్ చేయగలదు

అమూల్యమైన చర్మము, నూనె వగైరాలకు ఆధారమైన సముద్రపు జంతువు సీల్. ఇది 5 నిమిషాలలో నీటిలో 600 అడుగుల లోతుకు వెళ్లి సునాయాసంగా పైకి వచ్చేయగలదు.

* * *

## దట్టమైన మంచువర్షము

యునైటెడ్ స్టేట్స్ కొలరాడోలో సిల్వర్ లేక్ మీద ఏప్రిల్ 14,1921న 24 గంటలలో 76 అంగుళాల మంచువాన మిక్కిలి దట్టంగా కురిసింది.

* * *

## ఏరిన ముత్యాలు

ప్ర: చింతకు కారణం ఏమిటి?
జ: అసంతృప్తి
ప్ర: మనకు ఎక్కువ అపాయకరం ఏది?
జ: గర్వం
ప్ర: మరణం కంటె హీనమైనది ఏది?
జ: మూఢత్వం
ప్ర: అన్నిటినీ ఎవరు జయించగలరు?
జ: ఓర్పుగల సత్యవంతుడు
ప్ర: ఎవరు అసలైన గ్రుడ్డి?
జ: విశ్వాసం లేనివాడు
ప్ర: పెద్ద శత్రువు ఎవరు?
జ: కోరిక
ప్ర: మహాపాపం ఏది?
జ: దౌర్జన్యం
ప్ర: జీవితంలో వృద్ధిపొందేవారు ఎవరు?
జ: వినయవంతుడు
ప్ర: అంతా నష్టపోయేవాడు ఎవరు?
జ: కోపిష్ఠి
ప్ర: పరమాత్ముడు అంటే?
జ: నీ మంచి చేతలు

"మూర్ఖుణ్ణి మెచ్చుకోడానికి అతణ్ణి మించిన పెద్ద మూర్ఖుడు మరొకడు ఉంటాడు."

## స్టెతోస్కోప్ 1816లో కనుగొనబడింది

రీనీ లెన్నెక్ (Rene Laennec) అనే ఫ్రెంచి వైద్యుడు 1816లో స్టెతోస్కోపును కనిపెట్టాడు. స్టెతోస్కోపు అనే పదం గుండె అనే అర్థమిచ్చే గ్రీక్ పదం, స్టెతోస్ నుంచి ఏర్పడింది.

## 27 సంవత్సరాలపాటు చదరంగంలో ఛాంపియన్

జర్మనీకి చెందిన డా ఇమ్మాన్యువల్ లాస్కెర్ (1868-1941) 27 సంవత్సరాల పాటు 1894 నుండి 1921 వరకు ప్రపంచపు చదరంగం ఛాంపియన్‌గా ఉన్నాడు.

* * *

## మొట్ట మొదటి టైప్‌రైటర్‌ను హెన్రీమిల్ నిర్మించాడు

బ్రిటిష్ నవ్యవస్తు కల్పనాచతురుడు హెన్రీ మిల్ 1714 లో మొట్ట మొదటి టైప్‌రైటర్‌ను కనిపెట్టాడు. ఇది ఉపయోగించడానికి అనువుగా లేనంత మోటుగా ఉండేది. తరువాత 1874 లో మొట్ట మొదటి ఆధునిక టైప్‌రైటర్ రెమింగ్‌టన్ మార్కెట్‌లో ప్రవేశించింది.

* * *

## ప్రపంచంలో మిక్కిలి ప్రియమైన మూలపదార్థము

మానవుడు తయారుచేసే కాలిఫోర్నియమ్ (Californium) ఒక్కటే ప్రపంచంలో మిక్కిలి ఖరీదైన మూలపదార్థము. ఒక గ్రాము వెల 1,000,000,000 డాలర్లు.

* * *

## మొక్కల పరిశోధనకు సుప్రసిద్ధ కేంద్రం

ఇంగ్లండ్ లండన్ నగరంలో 'ది క్యూ గార్డెన్స్' మొక్కల పరిశోధనా కేంద్రంగా ప్రసిద్ధి పొందింది. ●

## మిక్కిలి మృదువైన ఉన్ని

దక్షిణ అమెరికా పెరూ ఆండీస్ పర్వత ప్రదేశాలలో వదునకునా (Furry Viouna) లేదా వచ్చే ఉన్ని ప్రపంచంలో మిక్కిలి అందమైనది, మృదువైనది కానీ ఇది రెండు సంవత్సరాలకొకసారి 8 ఔన్సులు మాత్రమే ఇస్తుంది.

## పచ్చి ఉల్లిపాయ పక్షవాతానికి మందు



పచ్చి ఉల్లిపాయ క్రమం తప్పక రోజూ తింటూంటే పక్షవాతం రాదని లక్నోలో ఒక వైద్యపరిశోధక బృందం తెలియజేస్తూంది పచ్చి ఉల్లిపాయరసం శరీరంలో రక్తప్రవాహాన్ని క్రమబద్ధం చేసి గుండెకు అంతరాయం ఏర్పడకుండా చేస్తుంది. శరీరంలో రక్తాన్ని గడ్డకట్టనీయకుండా ఉండటానికి కూడా ఇది సహకరిస్తుంది.

"కోరి కోరి తాము కల్పించుకున్న విధి నిషేధాలనే సంకెళ్లు తమ కాళ్లకు విడదీయని బంధాలు అవుతాయి."

# సాంఘిక విజయానికి అయిదు మెట్లు

డా. క్లైవ్ డి.హర్లీ

మానవుడు సంఘజీవి తోటివారి సహవాసాన్ని అభిలషిస్తాడు. ఒంటరితనంవల్ల రెండు విధాల నష్టం. ఏర్పడుతుంది. తోటి వారితో కలసిమెలసి జీవించే సంతోషం, ఉత్సాహం నీకు ఉండదు. నీవల్ల ఇతరులకు కలిగే సంతోషం వారికి లభించదు. సాంఘికంగా దిగ్విజయం పొందాలంటే నీకు ఈ అయిదు సూచనలు సహకరిస్తాయి :



1. నువ్వు నువ్వుగా నీవ్యక్తిత్వాన్ని పెంచుకో : నీ గురించి నిరాశా భావంతో ఆరాటపడిపోవడం మానుకో జీవితంలో ఉపయోగకరమైన దానిని సాధించగలను అని నిశ్చయించుకో. నీ ప్రత్యేకత నీ వ్యక్తిత్వానికి పుష్టిని ఇస్తుంది.

నీ వివిధ ప్రతిభలను, సామర్థ్యాలను, చాతుర్యాలను అభినందించు. నీ మానసిక శక్తిని, నీ నైజాన్ని అభినందించు. నీవు అనుకునే దానికంటే నీలో అధికంగా నైపుణ్యం ఉంది. అవకాశాలు వాటంతటవే ఏర్పడతాయి నీ ప్రభావం చుట్టూ ఉన్నవారికి గోచరి స్తుంది వ్యక్తిత్వంలో హుందాతనాన్ని పెంపొందించుకో ఇతరుల హద్దులలో ప్రవేశించి వారికి హాని కలిగించనంతవరకూ నీహుందాతనానికి, నీ ఆశయాలకు అమూల్య మైన విలువ ఉండనే ఉంటుంది నీ శక్తి సామర్థ్యాల మీద విశ్వాసం పెంచుకో.

2 ఆశాభావం అలవరచుకో : సదా నీ ఆరోగ్యం గురించి ఆశాభావంతో ఉంటే నీకు ఆరోగ్యం సిద్ధిస్తుంది. ఆరోగ్యమే మహాభాగ్యం నీవు మంచి ఆరోగ్యవంతుడవు అయితే మరింత ఆత్మవిశ్వాసంతో ఆనందంగా జీవించ గలవు ఇతరులను ఆనందంగా జీవింపచేయ గలవు ఇతరుల లోపాలను లెక్కచేయకుండా వారిని గురించి సదభిప్రాయం పెంచుకోగలి గితే వారిలో ఉండే సద్గుణాలు నీవు కను గొంటావు. ఆవిధంగా ఇతరులతో స్నేహభావం

**యునైటెడ్ స్టేట్స్‌లో ప్రతీ సంవత్సరం 100 మిలియను కార్లు రిజిష్టరు అవుతున్నాయి**

అమెరికనుల నిత్యజీవితంలో ఆటోమొబైల్ గౌరవదిస్తాం. ఇది అమెరికనులు ఒకచోట నుండి మరోచోటుకి శీఘ్రంగా ప్రయాణం చేయడానికి ఉపయోగపడుతుంది. అమితంగా పెరిగిపోతున్న కారులవల్ల వాతావరణంలో అనేక సమస్యలు బయలుదేరుతున్నాయి. కాలుష్యం, రద్దీ, శబ్దం పాడైపోయిన పాతకారుల పరిష్కారం వంటి సమస్యలు ఎన్నో ఉన్నాయి. యునైటెడ్ స్టేట్స్‌లో ప్రతిసంవత్సరం 100 మిలియను పైబడిన కారులు రిజిష్టరు అవుతున్నాయి.

"లోపల అహంకారం అనేది ఉన్నప్పుడే
బైట రాగం అనేది కనిపిస్తుంది."

ప్రవృద్ధి పొందుతుంది సాంఘిక సంబంధమైన సమస్యలను, నిరుత్సాహాన్ని దరిచేరనీయ కుండా, సూక్ష్మంగా పరిశీలించగలిగితే మనోభావాలు నిష్కల్మషం అవుతాయి

3 విశ్రాంతి అలవరచుకో : మొట్టమొదట విశ్రాంతి పొందడానికి అలవాటు చేసుకో ఒత్తిడిని దరిచేరనీయకు కనుబొమ్మలు ముడుచుకుపోయి చేతులు కట్టుపడిపోయాయి అనుకోకు. అనవసరమైన ఆలోచనలు పెట్టుకోకు. జీవితంలో హాస్యాన్ని అనుభవించడం నేర్చుకో. నలుగురితో చేరి నవ్వడం అలవాటు చేసుకో. దీనివల్ల నీలో ఎంతో ఒత్తిడి తగ్గుతుంది. నరాలబలహీనత పోతుంది పకపక నవ్వలేకపోయినా చిరునవ్వుతో సంతోషంగా ఉండ గలిగితేచాలు

4 సదభిప్రాయం కలిగించు : ఇతరులు వారి గౌరవాన్ని వారు అనుభవించనీ అనవసరంగా పొగడ్తలకు దిగకుండా వారి గౌరవ మర్యాదలకు లోటురానీయకు ఇతరులు వారి మంచితనాన్ని అనుభవింప చేయడానికి ముందునీలో నీ మంచితనాన్ని మొదట నీవు అనుభవించగలగడం నేర్చుకో.

మానవుడు ఏదో పేరు ప్రతిష్టలు పొందాలని ప్రాధేయపడతాడు విచక్షణాబుద్ధితో దానికి తగినట్టుగా ప్రవర్తించ గలగాలి.

5. ఇతరులతో స్నేహాభివృద్ధిని పెంచుకో స్నేహితులను సంపాదించుకోడానికి నీ అంతట నీవు చొరవ చేసుకోడం అలవాటు చేసుకో కల్పించుకొని మాట్లాడడం ప్రారంభించు షేక్‌హాండ్ చేయి. చేతనైన చిన్న చిన్న సహాయాలు చేస్తూండు చేతికి కలం అందించు ఏష్ట్రే ముందు పెట్టు. పేర్లు జ్ఞాపకం పెట్టుకోడం చాలా ముఖ్యం ఏ భాషలోనైనా, సరే ఎవరి పేరు వారికి ఎంతో మధురంగా ఉంటుంది. ఒకరి పేరు ఇంకొకరితో చెబుతూంటే వారికి ఎంతోప్రీతి పాత్రుడవు అవుతావు.

●

## ప్రజ్ఞాశీలుడు

కేవలం కారణం మాత్రమే తెలుసుకోవడం కాదు. ప్రజ్ఞాశీలుడు మంచి చెడ్డలను వివేకంతో పరీక్షించి తెలుసుకుని ఇతరులకు న్యాయశీలుడైన మార్గదర్శకుడుగా ఉంటాడు.

— ధమ్మపద

## మానవజాతికి మహాద్భుతమైన ముందడుగు



*అమెరికన్ ఆస్ట్రోనాట్ నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రమండలం మీద కాలుమోపిన మొట్ట మొదటి మానవ యోధుడు జూలై 20,1969న ఆర్మ్‌స్ట్రాంగ్ మరియు ఎడ్విన్ ఆల్‌డ్రిన్ అపోలో 11లో ప్రయాణం చేస్తూ లూనార్ మాడ్యూల్‌తో చంద్రమండలం మీద దిగారు. అంతరిక్ష నౌక నిచ్చెన దిగుతూ ఆర్మ్‌స్ట్రాంగ్ 'ఇది మానవునికి ఒక చిన్న అడుగే కావచ్చు కానీ మానవజాతికి మహాద్భుతమైన ముందడుగు' అన్నాడు.*

"అభిమానం అసాధారణ ధర్మంగా పరిణమిస్తే అహంకారం అవుతుంది."

# నిజాలు - నిదర్శనాలు

## భారతదేశంలో వరి సాగు

భారత దేశంలో 1987-88 సంవత్సరంలో మొత్తం వరిపంట 56 43 మిలియను టన్ను




లైతే 1988-89 సంవత్సరంలో ఇది 70 మిలియను టన్నులకు పైబడిఉంటుందని అంచనా వేయబడింది

* * *

## గోధుమ సాగుబడి

1986-87 సం లో గోధుమపంట భారత దేశంలో హెక్టేరుకి 1998 కి గ్రా.లు ఇదే ఈజిప్టులో 4718 కి గ్రా లు, యుఎస్‌లో 2531 కి.గ్రా లు, చైనాలో 3033 కి గ్రా లు, జపానులో 3188 కి.గ్రా.లు, ఫ్రాన్స్‌లో 5560 కి గ్రా.లు, యుఎస్ఎస్ఆర్‌లో 1860 కి గ్రా.లు, పాకిస్థాన్‌లో 1559 కి గ్రా లు.

* * *

## 42,345 రెగ్యులర్ మేటర్స్ సుప్రీంకోర్టులో పెండింగ్‌లో ఉన్నాయి

1989 మార్చి నెలాఖరు వరకు సుప్రీం కోర్టులో 42,345 రెగ్యులర్ మేటర్స్, 1,62,128 అడ్మిషన్లు మరియు ఇతర కేసులు పరిష్కారం కాకుండా పెండింగులో ఉన్నాయి.

* * *

## ఆయిల్ పామ్‌చెట్ల పెంపకానికి ప్రపంచంలో మలేసియాదే అగ్రస్థానం

వ్యాపార స్థాయిలో భారతదేశంలో ఒక్క కేరళలో మాత్రం 3,705 హెక్టేర్ల ఆయిల్‌పామ్ పండించబడుతుంది. అండమాన్ నికోబార్ ద్వీపాలలో 1,593 హెక్టేరులలో పండించబడుతూంది ప్రపంచంలో ఆయిల్‌పామ్ తోటల పెంపకానికి మలేసియాదే అగ్రస్థానం (1.68 మిలియన్ హెక్టేరులు). 1987వ సం లో మొత్తం ప్రపంచ ఉత్పాదనలో 58 శాతం అంటే 7 8 మిలియను టన్నుల పామ్‌ఆయిల్ ఉత్పాదన మలేసియాదే.

* * *

## మిక్కిలి చిన్న చేప

ఫిలిప్పైన్ ద్వీపాల దగ్గర నివసించే పాండకా పిగ్మి ప్రపంచంలో మిక్కిలి చిన్న చేప - కాఫీ గింజంతే ఉంటుంది.

"రాగం రోగం వంటిది. మనస్సును చేరి కర్మకోసం ప్రేరణను ఇతోధికం చేస్తూంటుంది."

## '88-'89 లో 16 లక్షల రెండు చక్రాల వాహనాలు ఉత్పత్తి కావింపబడ్డాయి

1987-88 లో 1,51,875 పాసింజరు కార్ల తయారీ 1988-89లో 1,66,098 కి పెరగగా అదే సమయంలో రెండు చక్రాల వాహనాల తయారీ 14,33,918 నుండి 16,04,000 కి పెరిగింది.

* * *

## భారత దేశంలో నీటిపారుదల క్రింద ఉన్న ప్రదేశం 57.8 మిలియను హెక్టేరులు

భారత దేశంలో నీటి పారుదల క్రింద ఉన్న ప్రదేశ వైశాల్యం 22 6 మిలియను హెక్టేరుల నుండి 57 8 మిలియను హెక్టేరులకు పెరిగింది. పాస్ఫేటు ఎరువుల వాడకం 56,000 టన్నుల నుండి 6 మిలియను టన్నులకు పెరిగింది.

* * *

## మిరియాల ఉత్పత్తి సాలీనా 40,000 టన్నులు

భారతదేశంలో సరాసరి హెక్టేరుకి 800 కి.గ్రా లు చొప్పున మొత్తం 40,000 టన్నుల మిరియాలు పండింపబడుతున్నాయి. ఈనాడు ప్రపంచపు మొత్తం మిరియాల పంట 1,40,000 టన్నులని అంచనా వేయబడింది. బ్రెజిల్, ఇండోనేషియా, మలేషియాలలో కూడా మిరియాలు ఎక్కువగా పండింపబడతాయి.

* * *

## తలసరి ప్లాస్టిక్ వినియోగం

సాలీనా తలసరి పశ్చిమ జర్మనీలో 68 కి గ్రా.లు, యుఎస్ఎలో 53 కి.గ్రా లు, ఫ్రాన్స్‌లో 35 కి.గ్రా.లు, యుకెలో 33 కి.గ్రా లు, దక్షిణ కొరియాలో 8 5 కి.గ్రా.లు మరియు భారతదేశంలో చాలా తక్కువగా 0 5 కి గ్రా లు ప్లాస్టిక్ వినియోగింపబడుతూంది

* * *

## న్యాయశాస్త్ర సంబంధమైన మాటలు

*Abrogation* - కాన్స్టిట్యూషనల్ అధారిటీ చట్టాన్ని తీసివేయుట లేక కొట్టివేయుట.

*Arrears* - చెల్లించకుండా ఉన్న బాకీసొమ్ము లేక చెల్లించడానికి గడువు అయిన తరువాత కూడా చెల్లించని బాకీసొమ్ము.

*Brief* - ఒక క్లయింట్ వ్యాజ్యంలో సంగ్రహ వాఙ్మూలము

*Deposition* - కోర్టులో సాక్ష్యంగా అంగీకరించబడే వ్రాతమూలకమైన ప్రమాణము.

*Heir* - స్వంతదారుడి మరణానంతరము హక్కు వల్ల ఆస్తిపాస్తులను పొందు వాడు, వారసుడు

*Heiress* - స్వంతదారుడు మరణించిన తరువాత అతడి ఆస్తిపాస్తులను హక్కువల్ల పొందెడి స్త్రీ వారసురాలు.

*Monogamy* - ఒకే భార్యను పెళ్లిచేసుకొనుట లేక ఒకే భర్తను వివాహమాడుట.

*Receipt* - సొమ్ముగాని, ఆస్తిగాని ముట్టినదని వ్రాతమూలకంగా తెలియజేయు చీటీ.

*Waive* - హక్కు లేక అధికారం వదులుకోవడం.

"అవివేకం వల్ల పుట్టే అభిమానం వల్ల పుడుతుంది రాగం".

## పెట్రోలు స్వయం సమృద్ధి

1989-90లో పెట్రోలు ఉత్పాదన మరియు వినియోగం వరుసగా 3,286 మరియు 3,182 వేల టన్నులని అంచనా వేయబడింది. కాబట్టి ఇక మీదట పెట్రోలు దిగుమతి అవసరం ఉండదు.

* * *

## మినీ మరియు పర్సనల్ కంప్యూటర్ల ఉత్పాదన

1987 మరియు 1988 సంవత్సరాలలో మినీ కంప్యూటర్లు, పర్సనల్ కంప్యూటర్లు వరుసగా 4 5,872 మరియు 60,000 ఉత్పాదింపబడ్డాయి

* * *

## భారతదేశంలో 4,50,300 గ్రామాలకు విద్యుత్ సౌకర్యం

భారతదేశంలో ఫిబ్రవరి 1989 కి మొత్తం 4,50,300 గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కలిగించబడింది.

* * *

## మిలటరీ మీద వ్యయం నిమిషానికి 1.5 మిలియను డాలర్లు

ప్రస్తుతం ప్రపంచంలో మిలటరీ మీద నిమిషానికి 1 5 మిలియన్ డాలర్లు వ్యయం అవుతూందని అంచనా వేయబడింది. ఇది ఏ ఏటికాయేడు బాగా పెరిగిపోతూంది.

* * *

## చేనేత బట్టలు మరియు దుస్తుల ఎగుమతి పెరుగుదల సూచన

1987లో రూ. 96.52 కోట్ల విలువగల చేనేత బట్టలు మరియు రూ 118 97 కోట్ల విలువగల చేనేత దుస్తుల ఎగుమతి 1988లో వరుసగా రూ 113 35 కోట్లు మరియు రూ 161 01 కోట్లకు పెరిగింది.

* * *

## భారతదేశంలో అదనపు బొగ్గు నిలువలు

జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా వారు 1988-89లో భారతదేశపు అదనపు బొగ్గు నిలువలు 2,213 మిలియను టన్నులని అంచనా వేసారు దీంట్లో 778 54 మిలియను టన్నుల బొగ్గు నిలువలతో పశ్చిమ బెంగాలు ప్రథమస్థానం వహిస్తే తరువాత వరుసగా బీహార్ (736 52), మధ్యప్రదేశ్ (405.84), మహారాష్ట్ర (244 94) రెండవ, మూడవ, నాల్గవ స్థానాలు ఆక్రమిస్తున్నాయి.

## గోవా, ఢిల్లీ, పాండిచ్చేరిలలో టివి కవరేజి 100 శాతం

గోవా, ఢిల్లీ, పాండిచ్చేరిలలో వైశాల్యం మరియు జనాభా దృష్ట్యా టివి కవరేజి 100 శాతం ఉంది. అరుణాచల ప్రదేశ్‌లో టివి కవరేజి చాలా తక్కువ. ఇక్కడ ఇది వైశాల్యం దృష్ట్యా 2.1 శాతం, జనాభా దృష్ట్యా 4.9 శాతం మాత్రమే.

"రాగాన్ని మించిన దుఃఖం లేదు."

# ఇంటి సలహాలు

## కూరలను ఎక్కువ నీటిలో ఉడికించవద్దు

కూరలను ఎప్పుడూ ఎక్కువ నీటిలో ఉడికించవద్దు కూరలలో ఉండే విటమినులను నీరు పీల్చేసుకుంటుంది దీనివల్ల సువాసన, కమ్మదనం కూడా పోతాయి

* * *

## కారం తగ్గించాలంటే?



ఏదైనా వంటకంలో కారం ఎక్కువైతే కొంచెం టొమాటో రసం పిండితే వెంటనే కారం తగ్గిపోతుంది

* * *

## ఉప్పు ఎక్కువైతే?

వంట ఎప్పుడూ ఒకే సమంగా ఉండదు ఒక్కొక్కప్పుడు ఉప్పు ఎక్కువైపోతుంది. నోట్లో కూడా పెట్టుకోలేం. అలాంటప్పుడు చెక్కు తీసిన బంగాళాదుంప పడేసి కొద్దిగా వేడిచేస్తే బంగాళాదుంప ఉప్పుని లాగేస్తుంది

* * *

## పచ్చని కూరలు బాగా ఆకుపచ్చగా కనిపిస్తాయి

వండిన తరువాత కొన్ని కూరలు ఎరుపెక్కిన ఆకుపచ్చరంగులో ఉంటాయి నిమ్మరసం నాలుగు చుక్కలు వేస్తే కూరలు ఆకుపచ్చగా కంటికి ఇంపుగా కనిపిస్తాయి.

* * *

## బంగాళదుంపలు రంగు మారకుండా ఉండాలంటే?

చెక్కుతీసిన బంగాళాదుంప రంగుమారకుండా ఉండాలంటే చెక్కుతీసిన వెంటనే వాటిని చల్లని ఉప్పునీటిలో వేయండి

— 'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

## ఇంకా మానవస్పర్శ లేని భూతలం మూడవవంతు

భూతలం మూడవవంతు ఇంకా మానవస్పర్శ లేకుండా ఉందని యుఎస్ లో సైయెర్రాక్లబ్ (Sierra Club) తెలియజేస్తూంది. సోవియట్ యూనియన్ మరియు కెనడాలో ఆర్కిటిక్ ప్రదేశాలు, ఆఫ్రికాలో సహారా, ఆస్ట్రేలియాలో ఔట్‌బాక్ (out back), దక్షిణ అమెరికా అడవులు మానవుడు ఆక్రమించని ప్రదేశాలుగా ఉన్నాయి. 78 దేశాలలో ప్రదేశాలు మరియు అంటార్కిటిక్ ఖండము చేరి దీని మొత్తం వైశాల్యం 8,288 మిలియను హెక్టేరులు.

— 'సిఇఇ. ఎస్ ఎఫ్ ఎస్' సౌజన్యంతో

"అంతరాత్మ స్వరూపమైన బ్రహ్మభావంలో నానాత్వానికి తావులేదు."

# అసాధారణమైన పాములు

టి.ఎస్.ఎన్. మూర్తి

షీల్డ్ టెయిల్డ్ (రక్షక కవచపు తోక) పాము లను గురించి చాలామందికి తెలియదు. కొద్ది మందే వీటిని చూచి ఉంటారు 'షీల్డో లేక రఫ్‌టెయిల్స్' అని చెప్పబడే ఈ పాములకు తోక చివర ముళ్లకవచం ఉంటుంది. ఈ పాములు చాలా చిన్నవి. 45 సెం.మీ.లు దాటి ఉండవు.


SHIELD - TAILED SNAKE

ఇవి వెలుతురును భరించలేవు నేలమీద కలపక్రింద, వదులుగా ఉండే చెట్ల బెరడు మధ్య, దక్షిణ ఇండియాలో ఎత్తైన ప్రదేశాలలో తేమగా ఉండే చిన్నచిన్న అడవులలోను నివసిస్తాయి. సాధారణంగా అందరికి కనిపించకుండా దాక్కుంటాయి.

దక్షిణ ఇండియాలో పశ్చిమ కనుమలలో, శ్రీలంకా పర్వత ప్రదేశాలలోను సుమారు 44 రకాల 'రఫ్‌టెయిల్'లు కనిపిస్తాయి. అనేక విధాలుగా ఇవి చాలా అపురూపంగా ఉంటాయి శరీరం చాలా పొట్టిగా, గుండ్రంగా, స్థూపా కారంలో ఉంటుంది మెడ వేరుగా కనిపించదు మొద్దుగా ఉండే తలభాగంతో తడిమట్టిలో దూరి కన్నాలు చేసుకుని భూమిలో అడుగున నివసిస్తాయి. ఇవి భూమిలో 10-30 సెం.మీ.ల లోతుగా బొరియలు చేసుకుంటాయి. అందు చేతే సాధారణంగా పశ్చిమకనుమల కాఫీ తోటలలో భూమిని త్రవ్వి వీటిని పైకి తీస్తుంటారు.

రఫ్‌టెయిల్ పాములు పగలు అంతా భూమిలో ఉండి రాత్రిపూట పైకి వచ్చి చిన్న చిన్న వానపాములు, ఇతర మెత్తటి శరీరాంగాలు గల కీటకాలను తింటాయి. ఈ పాములు చిన్నపాములను పెడతాయి. ఒక్కొక్కసారి మూడు మొదలు ఎనిమిది చిన్నపాములను పెడతాయి కొన్ని రకాలు గ్రుడ్లను పెడతాయి.

బొరియలలోకి చొచ్చుకునిపోయే ఈ పాములు ప్రకాశవంతమైన ఎరుపు, నారింజ, నీలం, ఊదారంగులలో ఉంటాయి. చాలా సాధువైనవి అపాయకరమైనవికావు. వీటికి విషంలేదు ఎంత మోటుగా పట్టుకున్నా ఇవి కరవవు. చేతిలో పెట్టుకుంటే చేతికి చుట్టుకుంటాయి. ●

## పరిపూర్ణతే లక్ష్యం కావాలి

కొన్నిటిలో సాధ్యం కాకపోయినా అన్నిటి యందు పరిపూర్ణతను సాధించాలనే లక్ష్యమో, ధ్యేయమో ఉండాలి. సోమరితనంతో నిరాశపడిపోయి, అధైర్యంతో సాధించలేక వదులుకునే వారికంటె అభినివేశం, పట్టుదల, శ్రద్ధ గలవారు సంపూర్ణతను కొంతవరకైనా సాధించగలుగుతారు.

— చెస్టర్‌ఫీల్డ్

"కోరిక తీరకపోవడమే దుఃఖానికి కారణము."

# విజయానికి సలహాలు

భార్గవి నాగరాజ

వ్యక్తిగతంగా అద్భుతమైన విజయం సామాన్యం కాదు అనేక ముఖ్యవిషయాలతో కూడుకుని ఉంటుంది కాబట్టి బ్రహ్మాండమైన విజయం పొందిన ప్రతివ్యక్తికి కొన్ని ప్రత్యేక గుణాలు ఉంటాయి

రాజకీయాలలో ప్రావీణ్యుడైన మాజీ కేంద్ర మంత్రి ఐ.కె. గుజ్‌రాల్ విజయానికి గాఢమైన దీక్ష ముఖ్యకారణం. చిన్నప్పుడే స్వాతంత్ర్యం కొరకు గాంధీ ఉద్యమంలో పాల్గొన్న తల్లి



దండ్రులను చూసి ఇతడిలో ఉత్సాహం కలిగింది. బాల్యంలోను, యౌవ్వనంలోను అలవాటు చేసుకున్న ఈ గాఢమైన దీక్ష పెద్దపెద్ద విజయాలను సాధించడానికి సహకరించింది. ఈవిధంగా ఇతడు ప్రపంచశాంతికి, జాతీయ సమైక్యతకు అశేషకృషి సలిపాడు.

బొంబాయిలో ఇండియన్ మానేజిమెంట్‌లో సుప్రసిద్ధుడైన షారు రంగ్‌నేకర్‌కి 'ఆత్మావలోకనం' అపూర్వమైన విజయసాధనకి సహకరించింది. జయంలోను, అపజయంలోను ఆత్మావలోకనం చేసుకుని అంతఃపరిశీలనతో విజయానికి కారణాలను, అపజయానికి కారణాలను తెలుసుకునేవాడు ముఖ్యంగా అపజయాలలో ఇవి సహకరించాయి. వాటివల్ల ఎన్నెన్నో తెలియని విషయాలు తెలుసుకోగలిగాడు.

వివేకంతో కూడిన న్యాయశీలత ఫిలిప్పైన్స్‌లో ప్రవీణుడైన కంటివైద్యుడు డా. సాబినోబెన్నీ సాంటోస్ విజయానికి మార్గమైంది సద్గుణాలలో న్యాయప్రవర్తన అమూల్యమైనది. న్యాయప్రవర్తనవల్ల విజయం సిద్ధించి తీరుతుంది. విజయాన్ని ఆశించక్కర్లేదు 'న్యాయశీలుని విజయం వరిస్తుంది' అంటాడు

శక్తివంచన లేకుండా పనిచేస్తే దేనినైనా సాధించవచ్చని ఢిల్లీ సుప్రీంకోర్టులో మంచి

(మిగతా 52 వ పేజీలో)

## ప్రపంచంలో చాలాకాలానికి పూతపూసే చెట్టు

దక్షిణ అమెరికా బొలీవియాలో పూయా రెయ్మొండీ అనే చెట్టు ప్రపంచంలో చాలాకాలానికి పూవ్వు తొడుగుతుంది. సుమారు 150 సంవత్సరాల తరువాత పూతపూసి చచ్చిపోతుంది. ఈ చెట్టు 10.7 మీటర్ల ఎత్తు పెరుగుతుంది.

"చెట్టు బీజాన్ని ఉత్పత్తి చేస్తుంది. ఆ బీజమే మళ్లీ చెట్టును ఉత్పత్తి చేస్తుంది. అలాగే అజ్ఞానం దుఃఖానికి కారణం. దుఃఖానికి అజ్ఞానం కారణం."

# ఆసియాలో మిక్కిలి ఎత్తైన స్ట్రెయిట్ గ్రావిటీ కాంక్రీటు డామ్

26 సంవత్సరాల క్రితం నిర్మింపబడిన బ్రహ్మాండమైన భక్రాడామ్‌ను అక్టోబరు 22, 1963న భారతదేశపు ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశానికి అంకితం చేసారు శిక్కుల గురువైన గురుగోవింద్‌సింగ్ పేరున ఏర్పాటుచేసిన గోవింద్‌సాగర్‌లోకి సట్‌లెజ్ నదీ జలాలు వచ్చి చేరతాయి. 225 మీటర్ల ఎత్తైన ఈ డామ్ ప్రపంచంలో




మిక్కిలి ఎత్తైన స్ట్రెయిట్ గ్రావిటీ కాంక్రీటు డామ్.

బక్రాడామ్ ఎత్తులో కుతూబ్‌మినార్‌కి సుమారు మూడురెట్లు. 1,00,000 గదులలో 60 అంతస్థుల ఆకాశాన్ని అంటే భవనం పట్టగలంత పరిమాణం ఉంటుంది. దీని నిర్మాణానికి ఉపయోగించిన కాంక్రీటు భూమధ్య రేఖ చుట్టూ విశాలమైన రోడ్డు నిర్మించడానికి సరిపోతుంది.

13,000 మంది పనివాళ్లు, 300 మంది ఇంజనీర్లు, 30 మంది విదేశీ నిపుణులు దీని నిర్మాణానికి సహకరించారు గోవింద్‌సాగర్ రిజర్వాయరు నుంచి నీరు పంజాబు, హర్యానా, రాజస్థాన్ రాష్ట్రాలలో మొత్తం 26.7 లక్షల హెక్టేరుల వైశాల్యంలో భూమికి నీటి సౌకర్యం కలిగిస్తుంది జలవిద్యుదుత్పాదనకు కూడా ఇది సహకరిస్తుంది

( 51 వ పేజీ తరువాయి)

అనుభవంగల అడ్వకేట్, కాన్‌స్టిట్యూషనల్ లాయర్ కె కె వేణుగోపాల్ తెలియజేస్తున్నారు శక్తివంచనలేని ఉద్యమం లేకుండా ఏదీ సాధించలేమని, సాధ్యంకాదని వీరు అంటారు

ఇంతేగాకుండా పిత్రార్జితమైన బ్రహ్మాండమైన న్యాయశాస్త్ర సంబంధమైన గ్రంధాలయం తనకు ఎంతో సహకరించిందని వీరు అభిప్రాయం తెలియజేస్తున్నారు

ఆశయం ఊరికే పేరుపొందడానికి కాదు ఉన్నతాశయాలతో కూడుకున్న జీవితమే విజయానికి మార్గం అని మాజీ కెనరా బ్యాంక్ చైర్మన్ శ్రీ బి రత్నాకర్ చెబుతున్నారు ఆశయం అనేది ఉత్సాహపూరితంగా ఉండాలి ఒక లక్ష్యాన్ని పెట్టుకుని ఆ లక్ష్యాన్ని సిద్ధించుకోడానికి సక్రమమైన ఉద్యమాలు సాగించాలి

అడ్వర్టైజింగ్ ఏజన్సీస్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా అధ్యక్షుడు ఆర్ కె స్వామి పట్టుదల మరియు ఓర్పుతో విజయాన్ని సాధించారు "దేనికోసం ఉద్యమం సాగిస్తున్నావు? ఉద్యమం సక్రమమార్గంలో సాగుతూందా?" అనే విషయాలు గ్రహించాలి అంటారు అడ్వర్టైజింగ్ రంగంలో ప్రఖ్యాతిపొందిన స్వామి.

— 'రోటరీన్యూస్' సౌజన్యంతో

"శరీరం లభించడం దోషం కాదు, శరీరంమీద ఆసక్తిని పెంచుకోవడం దోషం."

# నెమలి

అందమైన నెమలి భారతదేశపు దేశీయ పక్షిగా ఎన్నుకోబడింది. ఇది కవులకు, కళావిదులకు స్ఫూర్తిదాయకమైన పక్షి. మన పురాణాలలో నెమలి శివుని కుమారుడైన కార్తికేయుని వాహనంగా వర్ణించబడింది. ఈ కార్తికేయుడే మహారాష్ట్రులకు ఖాండోజి, తమిళులకు మురుగన్



ప్రాచీన కాలంలో ఈజిప్టులోని ఫారోలు, ఆసియా మైనర్ రాజులు వీటిని వారి తోటలలో పెంచుతూండేవారు మేసిడోనియా చక్రవర్తి అలెగ్జాండర్ ది గ్రేట్ భారత దేశంనుంచి తిరిగి వెళ్లినప్పుడు ఈ పక్షిని యూరప్‌లో ప్రవేశపెట్టాడు. ఇటలీ రోమ్‌లో దీనిని వండి అతి అప్యాయంగా తినేవారు. యూరప్‌లో అందమైన నెమలి ఈకలతో కప్పిన నెమలి మాంసపు వంటకంలేని విందు ఉండేదికాదు. పశ్చిమ రోమనుల రాజ్యాధిపతి ఛార్లె మాగ్నే చక్రవర్తి ఇచ్చిన విందులలో నెమలి వంటకాలను అమర్చేవాడు. ఇంగ్లండు రాజైన 8వ హెన్రీ ముఖ్యంగా కాల్చిన నెమలి మాంసాన్ని అభిలషించేవాడు.

ఆసియాలో చైనాదేశపు చక్రవర్తి మాండరిన్ అధికారికి అందమైన నెమలి ఈకను బహూకరించాడు భారతదేశపు షాజహాన్ చక్రవర్తి నెమలి సింహాసనం బంగారంతో చేయబడి, అమూల్యమైన రత్నాలు పొదగబడింది!

## ఆంగ్లేయ భాషలో పదజాలం అత్యధికం

*ప్రపంచంలో ఆంగ్లేయ భాషను మాట్లాడేవారు 35,00,00,000 మందికి పైగా ఉన్నారు. అంతర్జాతీయ వాణిజ్య మరియు రాజకీయ రంగాలలో ఆంగ్లేయభాష ముఖ్యమైన భాషగా అభివృద్ధి పొందింది చైనావారి మాండరిన్ భాష తరువాత ప్రపంచంలో ఇతర భాషలకంటే ఆంగ్లేయ భాషనే చాలామంది వాడతారు. ప్రపంచపు ముఖ్యభాషలలో ఆంగ్లేయ-భాషే క్రొత్తగా ఏర్పడినా ఏ ఇతర భాషలో కంటే ఇందులోనే పదజాలం చాలా అధికం. సుమారు 8,00,000 పదాలు ఉన్నాయి.*

*ఆంగ్లేయ పదమూలాలు ఆంగిల్స్ మరియు సాక్సన్ జాతులు మరియు 5, 6 శతాబ్దాలలో ఇంగ్లండు స్వాధీనం చేసుకుని అక్కడ వృద్ధి పొందినజ్యాతులుమాట్లాడుకునే ట్యుటోనిక్ (జర్మన్) భాషనుంచి ఏర్పడ్డాయి. నేటికి కూడా అనేక ఆంగ్లేయ పదాలు డచ్ మరియు జర్మన్ భాషల నుండి ఏర్పడ్డవే. ఆంగ్లేయ భాషలో 'House' అనే పదం జర్మన్ 'Haus' డచ్ 'Huis' పదాల నుంచి ఏర్పడింది.*

*ఆంగ్లేయభాష అనేక ఇతర భాషలనుంచి పదాలను ఎరువు తెచ్చుకుంది. అనేక క్రొత్త పదాలు చేరాయి. మరియు ఆంగ్లేయులు సంబంధాలు కలుపుకున్న వారి భాషల నుంచి కూడా అనేక పదాలు చేరుతున్నాయి. విదేశీ భాషలన్నిటిలోకి నార్మన్‌ను జయించినవారి లాటిన్ ఫ్రెంచి భాషల ప్రభావం ఆంగ్లేయ భాష మీద చాలా అధికం.*

*— ఇంగ్లండ్ ఐన్‌ఫెక్టర్స్' జెమ్సనాక్ సౌజన్యంతో*

'ఆత్మసంబంధమైన జ్ఞానం లేక చంపేవాడు చంపాననుకుంటాడు; చచ్చినవాడు చంపబడ్డాననుకుంటాడు.''

# విజ్ఞానవేదిక

## భారతదేశపు శాసనాలు

పూర్వం మనదేశాన్ని పాలించిన రాజులు, రాజవంశక్రమాలు, దేవాలయాలకు, బ్రాహ్మణులకు ఇతరులకు రాజులు చేసిన దాన వివరాలు, రాజుల విజయ యాత్రలు, రాజులు, రాజ ప్రతినిధులు వివిధ సమస్యలకు చెప్పిన తీర్పులు మొదలగు ప్రజోపయోగకరమైన అనేక విషయాలను, సమాచారాలను తెలుసు



కోడానికి శాసనాలే ముఖ్య ఆధారం దేవాలయాలలో గోడలమీద, రాళ్ల మీద, స్తంభాలమీద, మట్టి, కొయ్య లేక లోహపు పలకల మీద, ఇటుకల మీద, కుండలమీద, రేకులమీద ఈ శాసనాలు చెక్కబడ్డాయి నాణాలు, శంఖాలు, దంతపు పలకలు, తాబేటి చిప్పలు మీద కూడా వ్రాశారు ఆ తరువాత భూర్జపత్రం మీద, తాటాకుల మీద, పట్టుబట్ట మీద వ్రాయడం ప్రారంభించారు.

ఒక ప్రదేశంలో త్రవ్వగా భూమిలో లభించిన శాసనాలను పరిశీలించి, పరిశోధించి రాజులు, రాజవంశాలు క్రమ పద్ధతిలో వ్రాయబడ్డాయి. భారతదేశంలో అతి ప్రాచీనమైన 2000 బి సి నాటి శాసనాలు ప్రపంచ ప్రసిద్ధి పొందిన మొహంజదారో (సింధు), హరప్ప (ప పంజాబు) లోతాల్ (గుజరాత్) కాలీబంగన్ (రాజస్థాన్) మొదలైన ప్రదేశాలలో కనుపించాయి ఇక్కడ బయల్పడిన సీలులు, ఇతర వస్తువుల మీద చిత్రలిపిలో ఉన్న వ్రాతలు కనిపించాయి

గొప్ప గొప్ప పండితులు, శాస్త్రజ్ఞులు నేడు ఈ చిత్రలిపిలో ఉండే భావాలను తెలుసుకోడానికి ప్రయత్నిస్తున్నారు. భారత దేశపు చరిత్రలో మౌర్యవంశపు రాజుల కాలంనాటి బ్రాహ్మీలిపిలో ఉన్న శాసనాలను తెలుసుకున్నారు మౌర్యవంశపు రాజులలో ముఖ్యుడైన అశోకునికి సంబంధించిన 150 శాసనాలు బ్రాహ్మీలిపిలో ఉన్నాయి వీటిని నిర్వివాదంగ తెలుసుకోగలిగారు భారత దేశంలో బ్రాహ్మీ లిపిలో అశోకుని శాసనాలు కొన్ని దక్షిణాన కర్ణాటక వరకూ కూడా వ్యాపించి ఉన్నాయి

అశోక చక్రవర్తి పరిపాలనా విధానం, రాజ్యంలో ప్రజలకు అతడు చేసిన ఉపకారాలు, ఆనాడు భారత దేశానికి ఇతర దేశాలతో గల సంబంధాలు, అహింసాతత్వాన్ని విదేశాలలో బోధించడానికి చేసిన ప్రయత్నాలు, అనుసరించిన మార్గాలు మొదలైన విషయాలు అశోకుని శాసనాలవల్ల మనకు తెలుస్తున్నాయి. అశోక చక్రవర్తి శాసనాలనుంచే నాగర లిపి, ఇతర ద్రావిడ జాతికి చెందిన భాషా లిపులు, టిబెట్, బర్మా, ఇండోచైనా, ఇండోనేషియా,

"పరమత ద్వేషమే మానవ చరిత్రలో
క్రూరమైన నేరాలకు ముఖ్య కారణం."

శ్రీలంకా భాషాలిపులు తెలుసుకోబడ్డాయి. అశోకుని కాలంలో శాసనాలకు ప్రాకృతి భాష ఉపయోగించబడింది కాలక్రమేణా సంస్కృత భాషలోను మరియు స్థానిక భాషలోను వ్రాయడం ప్రారంభించారు

ఢిల్లీ మెహరాలీ లోని కుతుబ్‌లో ఇనుప స్తంభంమీద చెక్కబడిన సంస్కృత శ్లోకంవల్ల విష్ణుపాద అనే పర్వతంమీద చంద్ర అనే రాజు దీనిని వేయించినట్టు తెలుస్తూంది. కర్ణాటకలో అయిహోల్ శాసనం నుంచి కాళిదాస, భారవి వంటి పండితుల కాలాలు తెలుసుకోబడ్డాయి.

తమిళనాడు కాంచీపురంలో పల్లవరాజులు చేపట్టిన విస్తృత పరిపాలనావిధానం, వారిచ్చిన ఆదేశాలు, చట్టాలు రాగిరేకులమీద వ్రాయబడ్డాయి ఇటువంటి రాగిరేకులలో పల్లవ చక్రవర్తి శివస్కందవర్మన్ (4వ శతాబ్దం ఎడి) యొక్క హిరహదగల్లి శాసనాలు కొన్ని లభించాయి ఈ శాసనంలో వివిధరంగాలలో చక్రవర్తి ఉద్యోగస్థులకు ఇచ్చిన ఆదేశాలు ఉన్నాయి.

తమిళనాడులో రాతిపలకల మీద, రాగి రేకులమీద వ్రాయబడిన శాసనాలలో రాజ వంశాల వివరాలు పూర్తిగా వ్రాయబడ్డాయి. చోళచక్రవర్తి ఒకటవ రాజేంద్రుని కారంధై శాసనాలలో కాంభోజరాజు ఒక దివ్యరథాన్ని రాజేంద్రచోళుని శౌర్యానికి మెచ్చి ఇచ్చినట్టు తెలుస్తూంది.

భారతదేశపు చరిత్రలో మహమ్మదీయ యుగంలో అరబ్బీ, పర్షియా భాషలు బహుళ ప్రచారంలో ఉండేవి. వీరు కుఫీ, నాష్కే తుల్త్, నాస్థాలిఖ్ మరియు ఇతర లిపులలో శాసనాలు వేయించారు. ఢిల్లీ ఎర్రకోటలో మొగలాయి చక్రవర్తి జహంగీరు శాసనంలో బ్రిడ్జి నిర్మాణం వివరించబడింది. ఎర్రకోట మరోశాసనంలోగల పర్షియన్ పద్యశాసనం చివరి మొగలాయి చక్రవర్తి బహదూర్ షా నూతిని త్రవ్వించిన సమాచారం తెలియజేస్తూంది.

●

## మామ్మత్ - బ్రహ్మాండమైన ఏనుగు


MAMMOTH

ప్రాచీనకాలంలో ఒకప్పుడు జీవించి ఇప్పుడు పూర్తిగా అంతరించిపోయిన 'మామ్మత్' (*Mammoth*) బ్రహ్మాండమైన మిక్కిలి పెద్ద ఏనుగు. సోవియట్ యూనియన్ ఈశాన్యదిక్కుగా కోల్‌యామా నదిలో కనుగొనబడిన ఆరుమాసాల వయస్సుగల మామ్మత్ కాలిమీద గాయం తగిలి చనిపోయినట్లు శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేసారు. రేడియో కార్బన్ విశ్లేషణవల్ల ఇది 44,000 సంవత్సరాల పురాతనమైనది అని తెలుసుకున్నారు. ఆకాలంలో వాతావరణం చలిగా, పొడిగా ఉండేది. కాబట్టి రాళ్ల బురద క్రింద కప్పబడిన మామ్మత్ కళేబరం ఎంతకాలమైనా చెడిపోకుండా ఉంది.

"ఒకరు ఎంతకాలం జీవించినది చెప్పేవి సంవత్సరాలు కాదు. వారిచేతలే తెలియజేస్తాయి."

# గురుగ్రహం

సౌర కుటుంబంలో గురుగ్రహం ఒక్కటే చాలా పెద్దది ఇది సెకండుకి 13 కి.మీ.ల వేగంతో సూర్యుని చుట్టూ ఒకసారి పరిభ్రమించడానికి 11 సంవత్సరాల 318 రోజులు పడుతుంది గురుగ్రహం తనలో తాను అక్షం చుట్టూ తిరగడానికి 9 గంటల 55 నిమిషాలు పడుతుంది.

సూర్యుని నుండి గురుగ్రహం సగటు దూరం 775 మిలియను కిలోమీటర్లు భూగ్ర




హానికి 624 మిలియను కి.మీ దగ్గరగా వస్తుంది గురుగ్రహం మధ్యరేఖ దగ్గర దీని వ్యాసం 1,42,851 కి.మీ.లు దీని బరువు భూగ్రహానికి 318 రెట్లు.

సౌరకుటుంబంలో గురుడే మిక్కిలి కాంతివంతమైన గ్రహం భూగ్రహం మీది మానవులకు గురుగ్రహ తలం అంతా మేఘాలతో కప్పబడి ఉన్నట్లు తెలుస్తుంది. ఇక వాతావరణంలో 60 శాతం ఉదజని, 36 శాతం హీలియం, కొద్దికొద్దిగా మిథేను, అమ్మోనియాలు ఉంటాయి.

గురుగ్రహం మీద ఉన్న గ్రేట్ రెడ్ స్పాట్. వల్ల ఇక్కడ వాతావరణంలో తీవ్రమైన మార్పులు జరుగుతూంటాయని ఖగోళశాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు ఈ రెడ్‌స్పాట్ 40,000 కి.మీ.ల పొడవు, 12,000 కి.మీ.ల వెడల్పు ఉండి ఎర్రగా ఉంటుంది ఒకేచోట ఉండదు. సంవత్సర సంవత్సరం మారుతూంటుంది

గురుగ్రహం పైతలంమీద ఉష్ణోగ్రత సుమారు $-112^{\circ}$ C కానీ గ్రహతలంమీద ఇంకా వేడిగా ఉంటుంది ●

## వృద్ధాప్యం వచ్చిందన్న మాట

మందులు మరియు సౌందర్య సాధనాలవల్ల వృద్ధాప్యంలో కూడా చాలామంది ఇంకా సామర్థ్యవంతంగా రూపలావణ్యంతో కనిపిస్తూ ఉంటారు. వృద్ధాప్యం వచ్చిందేమో తెలుసుకోడానికి ఈ జాబితాతో సరిచూసుకోండి

మీరూ వృద్ధులే.

* ముసలితనంతో తల బట్టతల అయిందని స్నేహితులు అనుకున్నప్పుడు, మీ ఆవిడ అత్తగారిలా కనిపించినప్పుడు
* క్రింద పడిపోయిన (పావలాగానీ, పైసాగానీ) వంగి తీసుకోడం కష్టం అనిపించినప్పుడు.
* చేతికి సూట్‌కేసు బరువు అనిపించినప్పుడు, మెట్లు ఎక్కడం కష్టం అనిపించినప్పుడు.
* ప్రపంచానికి ఏ చీకూ చింతా లేకపోయినా ప్రపంచం అంతా అధోగతికి దిగిపోతూందని అనిపించినప్పుడు.
* ఏళ్లతరబడి అనుభవంలో పొందిన విచక్షణా, విజ్ఞానం తగ్గిపోతూందని అనిపించినప్పుడు.
* ప్రతీసారీ మాట్లాడేటప్పుడు 'మరి మా రోజుల్లో' అని మొదలుపెట్టినప్పుడు.
* అధునాతమైన టు ఇన్ వన్, మిక్సీ గ్రైండర్ మొదలైన వాటిని గురించి 'యువకులకే బాగా తెలుసు' అనిపించినప్పుడు.
* 20 సంవత్సరాల యువతులు 'మామా' అని, 'తాతా' అని పిలవడం ప్రారంభించినప్పుడు వృద్ధాప్యం వచ్చేసిందన్నమాటే.

"నోరు మంచిదైతే ప్రపంచమంతా మంచిదే అవుతుంది."

# అక్కడా-ఇక్కడా

## సూపర్ కండక్టర్స్‌లో మరో ముందడుగు

న్యూయార్క్ యార్క్‌టౌన్ హైట్స్‌లో ఇంటర్నేషనల్ బిజినెస్ మెషీన్ (IBM) సంస్థలో పరిశోధకులు 100 రెట్లు అధికంగా విద్యుత్తును ప్రసరింపజేయడానికి సూపర్‌కండక్టర్స్‌ను రూపొందించే కొత్తమార్గాన్ని కనుగొన్నారు దీనివల్ల అభివృద్ధి కావింపబడిన కంప్యూటర్ చిప్స్, పవర్ ట్రాన్స్‌మిషన్ లైన్స్, మాగ్నెట్‌లు, ఎలక్ట్రిక్ మోటార్లు మరియు ఇతర ఉపయోగాలకు క్రొత్త సూపర్ కండక్టింగ్ వస్తువును ఉపయోగించవచ్చు.

## అభివృద్ధి పొందిన దేశాలలో బాలనేరాలు

46 దేశాలలో జరిపిన పరిశోధనల ఫలితంగా ఆర్థికంగానూ, సాంకేతికంగానూ బాగా అభివృద్ధి పొందిన దేశాలలో బాలనేరాలు చాలా అధికం అని తేలింది. ఇంటర్నేషనల్ పోలీస్ ఆర్గనైజేషనువారి రిపోర్టు ప్రకారం మొదటి 15 దేశాలలో నార్వే ఆస్ట్రేలియా, యుఎస్ఎ, ప.జర్మనీ, ఇంగ్లండ్, వేల్స్ మరియు జపాను దేశాలలో బాలనేరస్థుల శాతం చాలా అధికం

## భారత దేశపు మొట్టమొదటి పుష్‌బటన్ పవర్ ప్లాంట్

ఆంధ్రప్రదేశ్ విజయవాడ థెర్మల్ పవర్ స్టేషనులో భారత దేశపు మొట్టమొదటి 'పుష్ బటన్' పవర్ ప్లాంట్ సిద్ధం చేయబడింది. పూర్తిగా దానంతట అదే నియంత్రించుకోగల విధానం ఈ విద్యుచ్ఛక్తి కేంద్రంలో ప్రప్రథమంగా ఉపయోగించబడుతుంది దీనివల్ల మానవశక్తి వినియోగం చాలా వరకు తగ్గుతుంది. అధిక విద్యుత్తు జనింప చేయబడుతుంది.

## కంపించే పాదరక్షలు

సోవియట్ యూనియన్‌లో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు కనిపెట్టిన కంపించే పాదరక్షలతో ప్రక్క మీద పడుకున్నప్పుడు నడుస్తూన్నట్టు అనిపిస్తుంది దీనివల్ల రోగులలో సంచలన వ్యాపారం చైతన్యవంతమై శీఘ్రకాలంలో ఆరోగ్యాన్ని పొందుతారు

## జపానీయుల టెలిఫోనులకు భారతదేశపు 'చిప్స్'

భారతదేశంలో భారీఎత్తులో తయారవుతున్న 'చిప్స్' అంటే ఇంటిగ్రేటెడ్ సర్క్యూటులు ఇప్పుడు జపానీయుల టెలిఫోనులలో, గడియారాలలో, యుఎస్ఎ మరియు యూరప్ లలో కంప్యూటర్లలోను వినియోగపడుతున్నాయి. ప్రభుత్వాధీనంలో నిర్వహించబడుతున్న సెమీకండక్టర్ కాంప్లెక్స్ లిమిటెడ్ వారు ఉత్పాదన, అమ్మకం చేబడతారు.

## వీధుల అట్లాసు

ప్రప్రథమంగా భారతదేశం పూనాలో మొదటి నుంచి చివరిదాకా వీధి అట్లాసు తయారైంది. ఈ అట్లాసు ఏ కష్టం లేకుండా ముఖ్యమైన ఎడ్రసు సులభంగా తెలుసుకోడానికి అందరికీ సహకరిస్తుంది

"కలం పట్టినంత మాత్రాన ప్రతివాడూ కాళిదాసు కాడు."

— పి. సీతారామరాజు

## సేంద్రియ కృత్రిమ భూసారం

సోవియట్ యూనియన్‌లో శాస్త్రజ్ఞులు స్టీలు టాంకులలో తక్కువరకం ఇటుక రంగు బొగ్గును నీటితోను మరియు సూక్ష్మజీవులతోను ఆరుగంటల సేపు పులియబెట్టి సేంద్రియ పదార్థాలతో మిక్కిలి సారవంతమైన కృత్రిమ భూసారం రూపొందించారు. ఈ కృత్రిమ ఎరువు వల్ల భూసారం అధికమై పళ్లు, పూలు, కాయగూరలు ఎక్కువగా పండుతాయి

## ప్లూటోకు దూరంగా మరో క్రొత్తగ్రహం

యుఎస్ నేషనల్ ఏరోనాటిక్స్ అండ్‌స్పేస్ అడ్మినిస్ట్రేషన్ వారు సౌర కుటుంబంలో ప్లూటోకు దూరంగా ఉండే రెండు గ్రహాలలో ఒక దానిని ధృవపరచారు. దీనిని బొంబాయిలో నెహ్రూ ప్లానెటోరియంకు చెందిన డా. జె జె రావాల్ అనే భారతీయ శాస్త్రజ్ఞుడు 1976లో కనుగొన్నాడు ఈ క్రొత్త గ్రహం భూమికంటే 5 రెట్లు పెద్దదిగా ఉంటుంది. ఇది సూర్యుని ఒకసారి చుట్టి రావడానికి 700 సంవత్సరాల కాలం పడుతుంది.

## ఫైర్‌ఫైటర్ రాబోటులు

సోవియట్ యూనియన్‌లో ఉత్తర యూరోపియన్ ప్రదేశంలో ఒనేగా సరస్సుమీద ఉన్న 18-19 శతాబ్దానికి చెందిన ప్రాచీన కాలపు కిజీ కొయ్యా శిల్పాలను సర్వదా సంరక్షించడానికి 14 రాబోట్ ఫైర్ ఫైటర్లను ఏర్పాటు చేశారు భూతలానికిపైన ఒక మీటరు ఎత్తుగా అమర్చిన తుపాకీ అడ్డంగాను, నిలువుగాను తిరుగ గలదు. కర్రగోడల మీద అగ్ని సంభవించినప్పుడు సెన్సారులు అలారం మ్రోగిస్తాయి. తుపాకీ గొట్టాలు తిరగడం ప్రారంభించి నీటిని పూరిస్తాయి

## తేదీకి సరైన వారం సూచించే కాలెండరు

చండీఘర్‌లో మదన్‌మోహన్ వాట్స్ క్రొత్తగా రూపొందించిన కాలెండర్ ప్రకారం 1 AD సంవత్సరం నుంచి అనంతంగా ఏ సంవత్సరం లోనైనాసరే ఒక ప్రత్యేకమైన తేదీకి సరైన వారాన్ని సులభంగా తెలుసుకోవచ్చు. ఈ కాలెండరులో నాలుగు పట్టికలుంటాయి మొదటి పట్టికలో సంవత్సరాలు సున్న మొదలు 99 వరకు ఉంటాయి రెండవ పట్టికలో 100 మొదలు 199 వరకు అంకెలు ఉంటాయి. మూడవపట్టికలో 200 మొదలు 399 వరకు నాల్గవ పట్టికలో 400 దగ్గరనుంచీ వరుసగా అంకెలుంటాయి

## 10,000 సంవత్సరాల నాటి ప్రాచీన గ్రామం

పోలండ్ పురాశిల్పవస్తు శాస్త్రజ్ఞులు మెసపటేమియా (ఇప్పుడు పశ్చిమ ఆసియాలో ఇరాక్)లో 10,000 సంవత్సరాలనాటి మిక్కిలి ప్రాచీనమైన గ్రామాన్ని కనుగొన్నారు. ఇదే ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన గ్రామం అంటారు ఇది 8000 బిసికి పూర్వ కాలంనాటిది

## ఈగలవల్ల 30 రకాల రోగాలు ప్రబలుతున్నాయి

సాధారణంగా ఇంట్లో కనిపించే ఈగ చాలా అపాయకరమైనది. దీనివల్ల కలరా, స్కార్లెట్ జ్వరం, పోలియో మైలిటిస్ మొదలైన రోగాలతోపాటు 30 రకాల ఇతర రోగాలు ప్రబలిపోతున్నాయి.

"జాతి గౌరవము నీతిపై నిలుచును.
నీతిలేకయున్న జాతి చెడును."

## పాముల ఆటగాళ్లు

న్యూఢిల్లీకి 25 కి.మీ ల దూరంలో ఉన్న మయూర్ బంద్ (హర్యానా)లో జనం పాములను ఆడించి జీవనోపాధి గడించుకుంటారు. ఇక్కడ 2000 పైగా జనం 500 మట్టి కొంపలలో నివసిస్తారు. ఒక్కొక్క కుటుంబానికి 10 పాములు ఉంటాయి

## మంట ప్రమాదాలకు కారణం

భారతదేశంలో ప్రతీ సంవత్సరం మంటల వల్ల ఏర్పడిన ప్రమాదాల వల్ల 2000 మందికి పైగా మరణిస్తున్నారు. సుమారు 5000 మంది తీవ్రమైన గాయాలకు గురి అవుతున్నారు చాలామటుకు ఈ ప్రమాధాలు క్రిందనేల మీద వండటం వల్ల ఏర్పడుతున్నాయి ఇళ్లలో ఎత్తుగా అరుగుల మీద వండుకుంటే ప్రమాదాలను నివర్తించుకోవచ్చు

## ప్రపంచంలో మిక్కిలి పొడుగైన తలవెంట్రుకలు గల మనిషి

చైనా సిచువాన్ ప్రావిన్స్‌లో జిన్‌యాంగ్ దగ్గర పర్వత ప్రదేశంలో నివసించే 84 సంవత్సరాల బుల్‌గౌడాకి ప్రపంచంలో మిక్కిలి పొడవైన తల వెంట్రుకలు ఉన్నాయి ఇతడి తల వెంద్రుకలు 3 1 మీటర్ల పొడవు ఉంటుంది

## జననాలరేటు కంటే మరణాల రేటు అధికం

పాపువా న్యూగినియాలో నివసించే హగాహాయ్ (Hagahai) జాతులలో జననాలు రేటు

## శాంతి శాంతించుగాక!



ఒక పడవ గాలివానలో చిక్కుకుంది. సముద్రం మీద భయంకరమైన పెనుగాలులు వీస్తున్నాయి. పడవ మునిగిపోవడానికి సిద్ధంగా ఉంది. పడవ మీద ఒకమూల ఒకవ్యక్తి నిశ్చింతగా నిద్ర పోతున్నాడు. ప్రయాణీకులు కంగారుతో భయపడి ఆ వ్యక్తిని లేపారు.

ఆ వ్యక్తి నెమ్మదిగా లేచి ఎందుకు అంత భయపడిపోతున్నారు? మీలో మీకు విశ్వాసం లేదా? అని అడిగాడు. అతడు పడవ అంచు మీదికి వచ్చాడు. రెండు చేతులు పైకి ఎత్తాడు. 'శాంతి శాంతించుగాక' అంటున్నాడు.

ఈ పిచ్చిమాటలేమిటని అనుకున్నారు వారు. ఇంతలో తుఫాను తగ్గుముఖం పట్టింది. సముద్రం నిశ్చలంగా ఉంది. సముద్రము గలిలే. ఆ వ్యక్తి జీసస్.

జీవితంలో అనేక పెనుగాలులు వీస్తుంటాయి. మనల్ని నిరంతరం భయపెడతాయి. మనస్సు అనే సరోవరం అల్లకల్లోలం అయిపోతుంది. మానవుని ప్రాపంచిక పడవ మునిగి పోవడానికి ప్రారంభిస్తుంది. మనలో మనం ఇవే ప్రశ్నలకు సమాధానాలు చెప్పుకోవాలి. కలత చెందిపోయిన మనస్సును శాంతింపజేసుకోవాలి. శాంతి శాంతించుగాక.

— 'యోగా' సౌజన్యంతో

"చేపలను అమ్మేవారికి పూలవాసన గిట్టదు,
పువ్వుల నమ్మేవారికి చేపల వాసన గిట్టదు."

కంటే మరణాల రేటు చాలా అధికం అని ఇటీవల జరిగిన ఒక సర్వేవల్ల తెలుసుకున్నారు దీనికి ముఖ్యకారణం ఇక్కడకు వచ్చే వారివల్ల కలిగే అంటురోగాలు. 1980 సంవత్సరానికి ముందు ఈ జాతుల వారికి ప్రభుత్వం వారితో గానీ ఇతర మిషన్ వారితో కాని సంబంధాలు లేవు.

—'సి.ఇ ఇ ఎన్ ఎఫ్ ఎస్' సౌజన్యంతో

## ఆఫ్రికా విదేశీ ఋణాలు

ఆఫ్రికా విదేశీ ఋణాలు 200 బిలియన్ డాలర్లు దాటింది ఆఫ్రికన్ దేశాలు తమ ఆదాయంలో సగం వంతు ఋణదాతలకు తిరిగి చెల్లించవలసివస్తుంది. 1990 సంవత్సరం నాటికి వీరి ఋణాలు 257 బిలియను డాలర్లు 2000 సంవత్సరానికి 550 బిలియన్ డాలర్లు అవుతుందని నిపుణుల అంచనా

## రైల్‌కోచ్ ఫాక్టరీ

పంజాబ్‌లో జలంధర్‌కి 20 కి.మీ ల దూరంలో హుసేన్‌పూర్ గ్రామంలో ఇండియన్ రైల్వేస్ వారి ఆరవ రైల్ కోచ్ ఫాక్టరీ ఉత్పాదన ప్రారంభించింది. రూ. 331 కోట్లు విలువచేసే ఈ ఫాక్టరీ 1991 నాటికి పూర్తిగా పనిచేయడం ప్రారంభించినప్పుడు సంవత్సరానికి 1000 కోచీలు తయారవుతూంటాయి.

## 469 మిలియను టన్నుల బొగ్గు వనరులు

ప.బెంగాల్ పురులియా జిల్లాలో సునూరి, మధుకుండ, పార్బెలియా మరియు రాణీపూర్ బ్లాకులలో 469 మిలియను టన్నుల బొగ్గు వనరులు ఉన్నట్టు కనుగొనబడింది. 17 చ.కి మీ ల వైశాల్యంగల సునూరి బ్లాక్‌లో 208 మిలియను టన్నుల బొగ్గు కేంద్రీకృతమై ఉందని అంచనావేయబడింది

## బంజరు భూములకు 2800 మాపులు

సాటిలైట్ ఇచ్చిన వివరాలను వ్యాఖ్యానించుకుని భారతదేశంలో మొట్టమొదటి సారిగా నేషనల్ రిమోట్ సెన్సింగ్ ఏజెన్సీవారు బంజరు భూములకు 2,800 మాపులను తయారు చేసారు. గ్రామీణ ప్రాంతాలలో బంజరు భూముల విస్తీర్ణం తెలియడంవల్ల 24 రాష్ట్రాలలో 146 జిల్లాలలో పోరంబోకు ప్రదేశాలను స్వాధీనం చేసుకోడం సులభం అవుతుంది

## సుభాషితాలు

భయము నమ్మి యజ్ఞానము
భయముడిగిన నిశ్చయంబు పరమార్థంబౌ
లయము నమ్మి ఈ దేహము
జయము నమ్మి జీవుడనుచు చాటర వేమా!

[అజ్ఞానమే భయము. అజ్ఞానం నశించినప్పుడు పరమార్థం స్పష్టమవుతుంది. శరీరం ఎప్పుడైనా లయంపొందేదే. జీవుడు స్థిరంగా ఉంటాడని నిశ్చయంగా తెలుసుకో.]

* * *

అప్పడుగరాదు హరిహరాదులకైన
మెప్పుతోడ మైత్రి మొదలె చెడు
తప్పులేక చేత తాకట్టిడిన చేత
విశ్వదాభిరామ వినురవేమ!

[హరిహరాదులకైనా అప్పుఇవ్వకూడదు. అట్టే తాకట్టు పెట్టడం, చెడ్డవారి స్నేహం, తప్పుడు మాటలు పల్కడం కూడా చేటే.]

"పదుగురాడు మాట పాడియై ధరజెల్లు
ఒక్కడాడు మాట ఎక్కదెందు."

# సంగీతశాస్త్రము - వాగ్గేయకారులు

సీతారవిచంద్రన్

మోక్షదాయకమైన సంగీతం మానవునికి ఆరోగ్యదాయకం కూడా కర్ణాటక సంగీతంలో వివిధ రాగాలలో పొందుపరచిన రసాలు మనస్సుపై ప్రభవిస్తాయి మానసికమైన ఉద్రే కాన్ని అణచి శాంతిని చేకూర్చగల మహాద్భుత శక్తి సంగీతానిది. వైద్య రంగంలో వివిధ రోగాలు వివిధ రాగాల శ్రవణం వల్ల నివృత్తి కాబడుతున్నాయి సంగీతం శక్తి మిక్కిలి బ్రహ్మాండమైనదని భారతీయుల విశ్వాసం. పరమశివుడు గానం చేస్తూంటే శ్రవణా నందంలో నిమగ్నుడైన విష్ణువు శరీరం మీద ఒక పార కరిగి ప్రవహిస్తూంటే దానిని బ్రహ్మ కమండలంలో పట్టినట్లు ఇదే తరువాత గంగ అయింది అంటారు

తమిళనాడు తంజావూరు జిల్లాలో వేదార ణ్యంలో దేవాలయం తలుపులు చాలా కాలం మూసి వేయబడ్డాయి. తమిళ భక్తులు జ్ఞాన సంబంధర్, అప్పర్ భక్తిపాటలు పాడిన వెంటనే దేవాలయం తలుపులు వాటంతటవే తెరుచుకున్నాయి.

తాన్‌సేన్ దీపక్ రాగం పాడి మరణిస్తూన్న రాజకుమార్తెను బ్రతికించాడు. దీపక్ రాగం వల్ల జనించిన వేడికి తాన్‌సేన్ బాధపడు తూండగా అతడి ప్రియురాలు 'తని' మేఘమల్హార్ రాగం పాడి ఉపశమనం కలిగించింది. వర్షధారలు కురిసాయి.

త్యాగరాజ స్వామి తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి దర్శనానికి వెళ్లినప్పుడు తెరవేసి ఉంది. దర్శనం కాలేదు. అప్పుడు గౌళిపంతు రాగంలో 'తెరతీయగ రాదా' అని పాడిన వెంటనే తెరపడి దివ్యదర్శనం అయింది.

ముత్తుస్వామి దీక్షితులు తమిళనాడు ఎట్ట యాపురమునకు పోవు దారిలో వర్షములు లేక క్షామపరిస్థితులున్న ప్రాంతముల నుండి ప్రయాణం చేయవలసి వచ్చింది. దాహంతో నీరు లేక వెంట ఉన్నవారు బాధపడుచున్నారు. అక్కడ దీక్షితులు అమృతవర్షిణి రాగంలో 'ఆనందామృత వర్షిణి, అమృత వర్షిణి హరాది పూజితే భవాని...సలిలం వర్షయ వర్షయ' అనే కృతిని గానం చేసిన వెంటనే పెద్ద వర్షం కురవగా వెంట ఉన్నవారు తేరు కున్నారట

ఇట్టి అపూర్వ సంగీతాన్ని సృష్టించి ప్రసిద్ధి కెక్కిన వాగ్గేయకారులు దక్షిణ దేశంలో అనేక మంది. వీరు రచించిన గేయాలు, వీరు పాడిన పాటలు వివిధ కళారూపాలతో విల సిల్లుతున్నాయి ప్రాచ్య దేశ భాషలలో ఇటలీ భాష వంటిది అని పొగడబడినది తెలుగుభాష. అజంతాలతో నిండి ఉండటమే దీని విశేషం. ఇట్టిభాష అనేక మంది వాగ్గేయకారుల ఉత్తమ కళాసృష్టికి అనుకూలంగా అమరింది. ఇదే కర్ణాటక సంగీతానికి కలిగిన మహాభాగ్యం. ముఖ్యంగా ఈ వాగ్గేయ కారుల రచనలకు భగవద్భక్తి ప్రోత్సాహమిచ్చినా వారు అవలంబించిన మార్గాలు భిన్నాలుగా కనిపిస్తున్నాయి. కొందరు కేవలం సంగీతంతో తృప్తి చెందారు. కొందరు గేయ నృత్యాభిన యాలు మూటిని జోడించి సంపూర్ణ భక్తిని వ్యక్తీకరించారు. మరికొందరు భజనలతో పాడుతూ, పారవశ్యంతో నృత్యం చేసారు. వీరందరూ భక్త్యావేశపరులే కాదు. సంగీతం లోనే గాక ఇతర కళలలోను సమగ్ర పాండిత్యం

"అవసరాలను తగ్గించుకుంటే పాపం క్షయించి ఆత్మవిశ్వాసంతో స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తావు."

నిపుణతగల మహనీయులు. భావనా స్వాతంత్ర్యం కలవారు. ప్రతి ఒక్కరు ఎవరికి తోచిన మార్గం వారు అవలంబించి తమ రచనలను సాగించారు. తమ తమ కాలాలలో ఉండే సంగీత సాంప్రదాయాలు పరిపక్వం చెంద డానికి తోడ్పడ్డారు. దీని ఫలితంగా ఒక నిండైన మార్గంలో అనేకమంది వాగ్గేయకారులు భక్తిని వ్యక్తీకరించారు

అన్నమాచార్యులు (క్రీ.శ.1408-1502)



తాళ్లపాక అన్నమాచార్యులు గొప్ప సంస్కృత విద్వాంసుడు. కలియుగ వైకుంఠమనే తిరుపతి క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరునిపై భక్తితో ఈతడి ఆడిన మాటెల్లా అమృత కావ్యంగా, పాడిన పాటెల్లా పరమగానంగా రూపొందింది. భక్తుడికి పరమేశ్వరుడికి నాయికా నాయక భావం, పతి పత్నీ భావం కల్పించి అనేక దేవాలయాలలో దివ్య మూర్తులను అభివర్ణిస్తూ భక్తితో శరణాగతి మహాత్మ్యాన్ని 32 వేల సంకీర్తనలలో ప్రతిపాదించిన కారణజన్ముడు అన్నమాచార్యులు పల్లవి, అనుపల్లవి, చరణములతో కూడిన ఆధునిక కృతి రచనకు ఇతడే ఆద్యుడు. తెలుగులో విశిష్టాద్వైత సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ గొప్ప రచనలను చేసిన ప్రతిభావంతుడు అన్నమయ్య. మనకు ఆది ప్రబంధ కవి నన్నయ్య. ఆది గేయకవి అన్నమయ్య. సంగీత సాహిత్య ప్రియులకు అతడి పాటలు తియ్యని తేనె పూటలు. 96 సంవత్సరాలు దీర్ఘకాలం జీవించి ప్రతినిత్యం శ్రీ వేంకటేశ్వరుని సేవిస్తూ వేంకటేశ్వరుని సాయుజ్యం చెందాడు.

నారాయణ తీర్థులు(1580-1680) . ఆంధ్రప్రదేశ్ గోదావరి జిల్లా కోనసీమ కూచిమంచి వారి అగ్రహారం ఇతడి జన్మస్థానం. ఇతడు వేద వేదాంగాలు, సంస్కృత సాహిత్యము, సంగీతము, నాట్యము బాగుగా ఎరిగిన పండితుడు. ఇతడు క్షేత్రాటనం చేస్తూ చల్లపల్లి, ముక్త్యాల సంస్థానాలలో కొంతకాలం ఉండి తిరుపతిలో శ్రీవేంకటేశ్వరుని దర్శించి శ్రీవారి ప్రేరితుడై ఉదర వ్యాధి నివారణకై తంజావూరు దగ్గర కావేరీ తీరమునా గల వరాహూర్ విష్ణ్వాలయాన్ని దర్శించాడు. ఇచ్చట విష్ణ్వాలయంలో భూదేవీ సమేతుడైన రమానాధుని సేవిస్తూ అక్కడ స్వామికి ఆలయం కట్టించి మూలస్థానం ప్రతిష్ఠ చేయించాడు. దాని ఫలితంగా అతడికి ఆరోగ్యం చేకూరింది ఇతడు రమానాధుని సన్నిధిలో పరవశుడై

**70,000 టన్నుల యురేనియం వనరులు**

అణుశక్తి ఉత్పాదనకు ప్రాతిపదికమైన యురేనియం వనరులు 70,000 టన్నులని అంచనా వేయబడింది. ప్రెషరైజ్డ్ హెవీ వాటర్ రియాక్టర్లలో (PHWR) ప్రకృతి సిద్ధమైన యురేనియంను వినియోగించి 30 సంవత్సరాలపాటు 10 మొదలు 15 Gwe శక్తిని కలిగించుకోవచ్చు.

— 'యోజన' సౌజన్యంతో

"సింధువును చేరి బిందువు సింధువగును,
ధ్యేయమునుబట్టి ప్రతి కార్యము దివ్యమగును." — మీర్జా గాలిబ్

సంస్కృతంలో శ్రీకృష్ణ లీలా తరంగిణి శ్లోకాలు, గద్యాలు, కీర్తనలతో 12 తరంగాలుగా రచించాడు. అన్నమాచార్యుల తరువాత ఇతడు అద్వితీయ ప్రతిభాశాలి, పరమభక్తాగ్రేసరుడు, యోగి, తత్వవేత్త.

ఇతడి 'ఏహిముదం దేహి' 'కలయ యశోదే' 'జయ జయ గోకుల బాల' 'బాల గోపాల మాముద్ధర' మొదలైన తరంగాలు భజనలలో పాడుతూంటారు ఇతడు అన్నమాచార్యులు ప్రారంభించిన ఆధ్యాత్మిక సంకీర్తనలలోని భక్తి వైరాగ్యాలను అవలంబించి యక్షగాన పద్ధతిలో రచనలు సాగించాడు.

రామదాసు (1620-1680) : నేల కొండపల్లి గ్రామవాసి భారతదేశ మందంతటా పరమ



భక్తాగ్రేసరులలో గణుతికెక్కిన భద్రాచల రామదాసు అసలు పేరు కంచర్ల గోపన్న. అప్రయత్నంగా అందరూ పాడుకోడానికి వీలుగా 'పలుకే బంగార మాయెనా కోదండపాణి' 'తారక మంత్రము కోరిన దొరికెను' 'ఏ తీరుగనను దయచూచెదవో ఇనవంశోత్తమ రామ' 'నను బ్రోవమని చెప్పవే సీతమ్మతల్లి' మొదలైన కీర్తనలు రచించి జ్ఞాన భక్తి మార్గాలలో వైరాగ్యం సిద్ధించుకుని రామభక్తి కారణంగా రామదాసు అనే పేరు పొందిన భక్త శిఖామణి భద్రాచలంలో తహశీలుదారుగా ఉంటూ గవర్నమెంటు వారి సొమ్మును రాముని కైంకర్యం కోసం ఖర్చుచేసి తానీషా చేత 12 సంవత్సరాలు బందీఖానాలో పడరాని కష్టాలు పడుతూ భక్త్యావేశంతో చెప్పిన కీర్తనలే రామదాసు కీర్తనలు. దాసరులు ప్రత్యేకంగా వీటిని పాడుతూ భజన చేస్తూ దేశాటనం చేస్తారు

క్షేత్రయ్య (క్రీ.శ 1600-1660) : అసలు పేరు వరదయ్య. ఆంధ్రప్రదేశ్ కృష్ణాజిల్లా



**రుడాల్ఫ్ డీసెల్ పేరు నుంచే డీసెల్ పేరు ఏర్పడింది**

గాలిని అకస్మాత్తుగా సంకోచింప చేయడంవల్ల ఉద్భవించే ఉష్ణానికి ఇంధనం అంటుకుని తిరిగే ఆయిల్ ఇంజను డీసెల్. దీనికాపేరు, జర్మన్ కల్పనాచతురుడైన రుడాల్ఫ్ డీసెల్ (1858-1913) పేరునుండే కలిగింది.

"అహంకార మమకారములను వ్యాధులకు వివేక వైరాగ్యములే దివ్యౌషధములు."

కూచిపూడి దగ్గర మొవ్వ గ్రామవాసి. మొవ్వలో గోపాలస్వామికి అంకితంగా శృంగార రస పూరితములైన పదాలను తేట తెలుగులో రచించాడు. అనేక భావాలతో పదాలను రచించాడు. వీటిలో మువ్వ గోపాలుడే నాయకుడు. తక్కిన జీవాత్మలన్నీ నాయికలే. ఈ భావంతో రచించిన పదాలన్నీ అభినయానుకూలంగా ఉంటాయి మధురభక్తి సాంప్రదాయాన్ని అనుసరించి ప్రపంచంలో సర్వ వ్యాపారాలు జీవాత్మ పరమాత్మల లీలా విశేషాలు, రాగానికి సర్వ సంపూర్ణమైన స్వరూపాన్ని తీర్చి దిద్దిన వారిలో క్షేత్రయ్య మొదటివాడు ఇతడి పదములలో అలంకార శాస్త్రములో చెప్పిన నాయికా నాయక భావాలన్నిటికి లక్ష్యాలు ఉన్నాయి. క్షేత్రయ్య నాటికి ఒక్క శృంగార పదాలకే 'పదాలని' వాడుక ప్రారంభమైంది. అంతకు ముందు ఆధ్యాత్మ కీర్తనలు, శృంగార కీర్తనలు రెంటిని పదములనేవారు క్షేత్రయ్య అనేక క్షేత్రాలను దర్శించి అచ్చటి దేవుళ్లమీద చెప్పిన పదాలన్నీ మువ్వ గోపాలునికే అంకితం చేసాడు చదివేటప్పుడు కంటే పాడేటప్పుడు, పాడేటప్పుడు కంటే అభినయం చేసేటప్పుడు ఇతడి పదాల సౌందర్యం తెలుస్తుంది.

త్యాగరాజు (1767-1847): త్యాగరాజు జన్మ స్థానం తంజావూరి దగ్గర తిరువారూరు. రామభక్తుడు. గొప్ప ఆధ్యాత్మిక తత్వవేత్త. సంగీత మార్గంలో ఆధ్యాత్మిక సత్యాలను సాధించిన సంగీత యోగి. ఉత్తమ పురుషార్థమైన మోక్షాన్ని సాధించడానికి శాంతగుణం ప్రధానమని ప్రబోధించాడు. నిరుపమానమైన వాగ్గేయ కారుడు, గొప్ప సంగీత వేత్త, మహా భక్తుడు. సంగీతంలో మహత్తరమైన కొత్త రూపాన్ని కల్పించిన సంగీత బ్రహ్మ శ్రీరామాంకితంగా 'త్యాగరాజనుత' అనే మకుటంతో ఇతడు రచించిన 24 వేల కృతులలో లభ్యమైన వెయ్యిలో 500కి మాత్రమే వర్ణము మెట్టు ఉంటుంది. శ్రీరాగంలో 'ఎందరో మహానుభావులు అందరికీ వందనములు' నాటరాగంలో 'జగదానందకారక జయ జానకీ ప్రాణ నాయకా', గౌళ రాగంలో 'దుడుకుగల నన్నేదొర కొడుకు బ్రోచురా', ఆరభి రాగంలో



'సాధించెనే ఓ మనసా', వరాళి రాగంలో 'కనకనరుచిరా కనకవసనా' అనేవి ఇతడు రచించిన ఘనరాగ పంచరత్న కీర్తనలు ఈతడు రచించిన ఉత్సవ సాంప్రదాయ కీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు, జన సామాన్యానికి గోష్ఠులలో పాడుకోడానికి అనువుగా ఉంటాయి

**అందరూ 88వ ఏట మరణించారు**

స్కాట్లండ్ న్యూమిల్‌లో జార్జిస్మిత్, అతడి భార్య జీన్, కుమార్తె జీన్, కోడలు ఎలిజబెత్ అందరూ 88వ సంవత్సరం వయస్సులోనే మరణించారు.

"దృష్టిలో బ్రహ్మతత్త్వం ఉన్నప్పుడు సృష్టిలో సమత్వం గోచరిస్తుంది."

తమిళనాడు తంజావూరులో కావేరీ నది గట్టున తిరువయ్యారులో ఇతడి సమాధి ఉంది. నేటికీ ప్రతి సంవత్సరం జనవరి మాసంలో వైభవంగా ఆరాధన జరుగుతుంది.

శ్యామాశాస్త్రులు (1762-1827) · తంజావూరులో కామాక్షి దేవాలయంలో శ్రీ కామాక్షమ్మను ఆరాధిస్తూ ఉండేవారు ఇతడు సామాన్య రాగాలలోనేగాక అపూర్వ రాగాలలో



కూడా కృతులను రచించాడు. కామాక్షీదేవి సాక్షాత్కరించి వీరితో సంభాషిస్తూండేదని అంటారు. ఇతడు తెలుగు, సంస్కృతం, తమిళ భాషలలో అనేక కృతులను రచించాడు వీటిలో దేవీ భక్తి అంతర్వాహినిగా ఉంటుంది. ఇతడి కృతులు 'శ్యామకృష్ణ' ముద్రతో ఉంటాయి. ఆనందభైరవి రాగంలో అనేక కృతులు రచించాడు ఇది ఇతడికి ప్రియమైన రాగము.

ముత్తుస్వామి దీక్షితులు (1776-1836)· కర్ణాటక సంగీత రత్నత్రయంలో త్యాగరాజు తరువాత గణింపదగిన వాగ్గేయకారరత్నము ముత్తుస్వామి దీక్షితులు. ఇతడు ఒక్క సంగీతంలోనే కాదు వేద, వేదాంత, యోగ, మంత్రశాస్త్ర, జ్యోతిష శాస్త్రాలలో నిష్ణాతుడు. భక్త వరేణ్యుడు. ఇతడు పెక్కు కీర్తనలు సంస్కృతంలోనే రచించినా కొన్ని తెలుగులో కూడా చేశాడు మరి కొన్ని సంస్కృతం, తెలుగు, తమిళం భాషలను కలిపి వ్రాశాడు. 'గురుగుహ' ముద్రతో తిరువారూరులో వెలసిన శ్రీ త్యాగరాజ స్వామిపై రచించిన వీరి కీర్తనలు అద్వైతాత్మకమైన వేదాంతతత్వంతో ఉంటాయి. శ్రీ కమలాంబను గురించి ఇతడు రచించిన నవావర్ణ కీర్తనలు జగత్ప్రసిద్ధములు. కర్ణాటక సంగీతంలో ఈ నవరత్న కీర్తనలకు అత్యంత ప్రముఖ స్థానం ఉంది తెలుగు సాహిత్యంతో మిక్కిలి పరిచయమున్న శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తెలుగు ఉదాహరణ కావ్య శిల్పాన్ని కూడా అనుకరించాడు ఇతడు రచించిన నవగ్రహ కీర్తనలు కూడా ప్రసిద్ధమైనవి.

ఇటువంటి వాగ్గేయకారులు, మహానుభావులు ఎందరో 'అందరికీ వందనములు' అన్నాడు త్యాగరాజు

●

## సరిగమలు పలికే స్తంభాలు

తమిళనాడులో మధుర్త, సుచీంద్రం, ఆళ్వార్ తిరునగరి దేవాలయాలలో సంగీత స్తంభాలు ఉన్నాయి. మధురైలో వెయ్యికాళ్ల మంటపంలో ముందు భాగంలో ఉన్న సంగీతస్తంభాలు 1560 AD లో శిల్పులు అతినైపుణ్యంగా నిర్మించారు. వేలితో మెల్లిగా కొట్టినప్పుడు ఒక్కొక్క స్తంభం ఒక్కొక్క స్వరం పలుకుతుంది.

"ప్రదర్శనలకోసం పూజలు, ధ్యానాలు చేసేవారు భక్తులు కారు."

# వైద్యరంగం

## కోరింతదగ్గు

విటలి కారెట్నీ

కోరింత దగ్గు సాంక్రామిక రోగం. సాధారణంగా క్రొత్తగా పుట్టిన చంటిపిల్లల దగ్గర నుంచి చిన్న పిల్లలవరకు సోకే రోగం ఇది. ముఖ్యంగా రెండు సంవత్సరాల వయస్సు వరకు పిల్లలకు ఈ జబ్బు మిక్కిలి అపాయకరమైనది. ఈ వయస్సులో ఇది తీవ్రపరిణామం చెంది పిల్లల శారీరక, మానసిక ఆరోగ్యానికి భంగం కలిగిస్తుంది.

ఈ జబ్బుతో బాధపడే ఇతర పెద్దపిల్లల సంపర్కంవల్ల మిగతా చిన్న పిల్లలకు ఈ రోగం అంటుకుంటుంది. ఒక్కొక్కప్పుడు కోరింత దగ్గు నిరోధకంగా టీకాలు వేసిన పిల్లలకు ఈ జబ్బు కొద్దిగా కనిపించినా దగ్గుతో అంత ఎక్కువగా బాధపడరు. కానీ టీకాలు వేయని పిల్లలకు దీని ప్రభావం తీవ్రంగా ఉండి అపాయకరమైన పరిస్థితులు ఏర్పడడానికి అవకాశాలు ఉన్నాయి.

ఈ సూక్ష్మజీవులను కనిపెట్టిన బాక్టీరియాల జిస్టుల పేరుతోగల బోర్డెట్ గెంగూ (Bordet-Gengou) సూక్ష్మజీవుల వల్ల ఇది కలుగుతుంది. ఈ సూక్ష్మజీవులు సూర్య రశ్మికి, అధిక ఉష్ణోగ్రత వద్ద నశిస్తాయి.

కోరింత దగ్గు రోగుల వల్లగానీ, వారు ఉపయోగించిన వస్తువులు, బట్టల వల్లగానీ సంక్రమించదు. సాధారణంగా రోగి దగ్గినప్పు సంక్రమించదు సాదారణంగా రోగి దగ్గి నప్పుడు సూక్ష్మజీవులు చేరి ఉన్న శ్లేష్మం ద్వారా విస్తుంది. కోరింత దగ్గు నాలుగు మొదలు 14 రోజులలో వృద్ధిపొంది బాగా ముదురుతుంది.

రోగం సంక్రమించిన తొలిరోజులలో సాధారణంగా ఫ్లూజ్వరంలో వచ్చే దగ్గులాగే దగ్గు ప్రారంభమవుతుంది. కాబట్టి దీనిని సులభంగా తెలుసుకోడం కష్టం. రోగి సాంక్రామిక లక్షణం 40 రోజుల వరకూ ఉంటుంది. ఒకసారి కోరింతదగ్గు పట్టుకున్న తరువాత తిరిగి ఇది రావడం ఉండదు.

కోరింత దగ్గుకి మొదటి ముఖ్యలక్షణం మామూలు దగ్గు. రోగం కన్పించిన మొదటి రోజులలో జ్వరం నార్మల్‌గా ఉండవచ్చు లేక 37.5 మొదలు 38 డిగ్రీలు సెల్షియస్ ఉండవచ్చు. తలలో జలుబు, గొంతుపుండుతో ఇది ప్రారంభమవుతుంది. ఈ విధంగా3 మొదలు 12 రోజులు గడిచిన తరువాత విపరీతంగా

### జిబ్రాల్టర్ జలసంధిని దాటిన చిన్న ఈతగత్తె

16 సం.ల. వయస్సుగల యువతి భారత దేశపు ఆర్తి ప్రధాన్ (Arti Pradhan) ఆగస్టు 30, 1988న జిబ్రాల్టర్ జలసంధిని అవలీలగా ఈది దాటింది. అద్భుతమైన ఈ సాహసానికి ప్రపంచంలో ఈమె మొదటి మహిళ-మొట్ట మొదటి బాలిక.

"ఎంత చదువు చదివి ఎన్ని నేర్చినగాని
హీనుడవగుణంబు మానలేడు."

దగ్గు వస్తుంది. రాత్రిపూట దగ్గు విస్తారంగా ఉంటుంది. ఆ తరువాత ఒక వారం మొదలు 2 వారాలు లేక రెండు నెలలపాటు ఆయాసంతో కూడిన దగ్గు ఏర్పడుతుంది. విపరీతంగా దగ్గేటప్పుడు చంటి పిల్లవాడు ఊపిరితీసుకోలేడు. ఉక్కిరి బిక్కిరి అయినట్టు కనిపిస్తాడు. ముఖం ఎర్రబారిపోతుంది. మెడమీద నరాలు ఉబ్బుతాయి. రెండు మూడు నిమిషాలకు గట్టిగా ఊపిరి లోపలకు తీసుకుంటాడు. ఊపిరితీసుకునేటప్పుడు బుసకొట్టినట్టు శబ్దం వినిపిస్తుంది. దగ్గు తెరలు తెరలుగా వచ్చి ఆయాసంతో నాలుక బైటకు పెడతాడు. గొంతుకనుంచి శ్లేష్మం వస్తుంది. కొందరికి వాంతులు అవుతాయి. మాటిమాటికీ వచ్చే దగ్గు రోగిని క్రుంగదీస్తుంది. ఆకలి ఉండదు. నిద్ర సక్రమంగా ఉండదు.

కోరింత దగ్గుతో బాధపడే పిల్లల శరీరం వివర్ణంగా ఉంటుంది. కనురెప్పలు వాస్తాయి. ముఖం ఉబ్బుతుంది. తరచు ముక్కు ద్వారా రక్తం స్రవిస్తుంది. ముందుగా దగ్గు కొంత కాలంపాటు ఉండి తరువాత రోగం వెనుకకు పట్టే పరిణామ ప్రభావం గోచరిస్తుంది. దగ్గు తీవ్రత తగ్గి అడపాదడపా దగ్గు వస్తుంది.

సాధారణంగా పిల్లలకు దీనివల్ల కలిగేఇతర తీవ్ర పరిణామం న్యుమోనియా జ్వరం. దీనివల్ల పిల్లలు పూర్తిగా నీరసించిపోతారు. ఇంత కంటే తీవ్రమైన పరిణామం నాడీ మండలానికి సంబంధించినది. కాళ్లూ, చేతులూ కొట్టుకుంటారు. మైమరపు ఏర్పడుతుంది. శరీరం నీల వర్ణంగా కనిపిస్తుంది. ఊపిరి సక్రమంగా తీసుకోలేరు, కష్టపడి ఊపిరి తీసుకుంటారు. తెలియకుండా మూత్ర విసర్జన చేసుకుంటారు. విరేచనాలు ఏర్పడతాయి.

ఒటిటిస్ అనేది మరో తీవ్రమైన పరిణామం. ముఖ్యంగా చిన్న పిల్లలలో ఇది దీర్ఘకాలం ఉండి అపాయ పరిస్థితులకు దారితీస్తుంది.

కోరింత దగ్గుతో బాధపడే పిల్లలకు ప్రశాంతమైన పరిసర వాతావరణం ఉండాలి. ఎంతమాత్రం ఉద్రేకం కలిగినా దగ్గు సులభంగా వస్తుంది. గదిలోకి మంచి వెలుతురు, గాలి ప్రవేశించాలి. అపాయకరమైన సమయాలలో ప్రాణవాయువు కూడా ఇవ్వవలసిన అవసరం ఉంటుంది.

ఇట్టి రోగులకు ఇచ్చే ఆహారం మంచి పుష్టికరంగా ఉండాలి. బాగా పళ్లు, కాయగూరలు ఇవ్వడం అవసరం. రోగికి తక్కువ మోతాదులో తరచు ఆహారం ఇస్తూంటే వాంతులు ఏర్పడవు. రోగ నివారణకు సాధారణంగా వైద్యులు శరీరంలో సూక్ష్మజీవులు ప్రవృద్ధి చెందకుండా ఆంటీ బయాటిక్ మందులు ఇస్తారు. దీనివల్ల శీఘ్రంగా నివారణ కలుగుతుంది. విపరీత పరిణామాలు ఏర్పడవు. గమ్మాగ్లోబ్యులిన్ (Gammaglobulin) అమోఘంగా పనిచేస్తుంది.

కోరింత దగ్గు నివారించుటకు టీకాలు వేయించడం చాలా ముఖ్యం. సక్రమంగా టీకాలు వేయించిన పిల్లలకు కోరింత దగ్గు అంటుకోదు.

●

## బ్రహ్మాండమైన జ్ఞాపకశక్తి

టర్కీ అంకారాలో ఖురాన్ పఠించిన పండిత శిఖామణులు ఆరుమంది సమక్షంలో అక్టోబరు 14, 1967న మహమ్మద్ అలీ హాలిస్ ఆరుగంటలలో ఖురాన్‌లో 6 666 పద్యాలు అప్పగించాడు.

'సాధు సాంగత్యమమరిన శాంతమమరు
శాంత మమరిన చిత్తంబు శక్యపడును.''

# ఉల్లిచేసే మేలు

ప్రాచీన కాలం నుంచీ కూడా అనేకమంది ఉల్లిపాయకు అద్భుతమైన గుణాలు ఉన్నాయని చెబుతున్నారు. ఈజిప్షియనులకు ఉల్లిపాయ మహాపవిత్రమైన మన తులసి వంటిది. దేవతలకు, పితృదేవతలకు దీనిని నైవేద్యం చేసి, భక్తితో పూజించి దాని ముందు దీక్ష వహిస్తారు. ఈజిప్టులో ఫరోల సమాధులలో ఉల్లిపాయల గుత్తులను ఉంచేవారు.




దీనిరసం సైనికులకు మంచి బలాన్ని, సామర్థ్యాన్ని, ధైర్యాన్ని కలిగిస్తుందని గ్రీకులు మరియు రోమనులు విశ్వసించారు. అధికంగా తింటే అపాయమని ప్రాచీనులు తెలుసుకోలేదు. ఉల్లిపాయ మితిమీరితింటే గుండెజబ్బులు, లివరు జబ్బులు వస్తాయని వీరికి తెలియలేదు.

మొండిజాతికి చెందిన చిన్నమొక్క, ఉల్లిపాయ ప్రపంచం అంతటా పాకిపోయింది. మధ్య యుగపు రోజులలో యూరప్‌లో ప్రతి దేశంలోను విరివిగా పెరిగింది. కొంతమంది వివాహాది కార్యక్రమాలలో ఉల్లిపాయలను విస్తారంగా వాడేవారు. థ్రేషియనులు (Thracian) పెళ్లి రోజున పెళ్లికానుకలతోపాటు పెద్ద పీపా నిండా ఉల్లిపాయలను కూడా కానుకగా ఇచ్చేవారు. ఈ విధంగా ఉల్లిపాయ దీర్ఘకాలం ఆరోగ్య సౌభాగ్యాలను ఇస్తుందని విశ్వసించ బడింది.

## ఇద్దరు బాటసారులు-గొడ్డలి

ఇద్దరు బాటసారులు చేరి ఒకసారి ప్రయాణం చేస్తూండగా దారిలో వారికి ఒక గొడ్డలి కనిపించింది. స్నేహితులైన ఇద్దరు బాటసారులలో ఒకడు ఆ గొడ్డలిని చేతితో ఎత్తి 'నాకో గొడ్డలి కనిపించింది. చాలా ఉపయోగపడుతుంది' అన్నాడు.

'నాకు అని చెప్పకు' అంటూ రెండవ బాటసారి 'మనకు ఒక గొడ్డలి కనిపించింది అని చెప్పు. మనమిద్దరం స్నేహితులం. మనమిద్దరం గొడ్డలిని చూసాం. ఇది మనది. తప్పకుండా దీన్ని అమ్మి వచ్చిన సొమ్ము పంచుకుందాం' అన్నాడు. మొదటివాడు దీనికి అంగీకరించలేదు. వాదించుకుంటున్నారు.

వీళ్లు ఈ విధంగా వాదులాడుకుంటూ కొంచెం దూరం వెళ్లారో లేదో గొడ్డలి స్వంతదారుడు పరుగు పరుగున వారి వెంటబడ్డాడు. చేతిలో గొడ్డలి ఉన్న బాటసారిని చూసిన వెంటనే 'నిన్ను చంపేస్తాను' అని భయపెట్టాడు. 'అయ్యోదేవుడా!' అంటూ మొదటి బాటసారి 'మనం చిక్కుల్లో పడ్డాం' అని మొత్తుకున్నాడు. 'మనం అని చెప్పకు' అని రెండవ బాటసారి అన్నాడు. 'నువ్వు చిక్కుల్లో పడ్డావని చెప్పుకో. దొరికిన దాంట్లో నాకు భాగం ఇవ్వలేదు. మరి ఇబ్బందిని నేను ఎలా పంచుకుంటాను?' అన్నాడు.

— 'ఇన్‌స్పిరేషనల్ కోట్' సౌజన్యంతో

"ధర్మో రక్షతి రక్షితః - మనం ధర్మాన్ని రక్షిస్తే ధర్మము మనలను రక్షిస్తుంది."

ఉల్లిపాయకు అపూర్వమైన శక్తులు లేవనే విషయం తెలుసుకోడానికి కొన్ని శతాబ్దాలు పట్టింది. అకాల మృత్యువును జయించడానికి ఇంగ్లండ్ దేశపు రిచర్డు చక్రవర్తి కంఠంలో పవిత్రమైన రుద్రాక్షమాలగా ఉల్లిపాయల దండ ధరించేవాడు

పూర్వం ప్లేగువంటి అంటురోగాలు ప్రబలినప్పుడు జనం ఇళ్ళలో ఉల్లిపాయల గుత్తులను వ్రేలాడదీసేవారు. కలరావంటి వ్యాధులు దీనివల్ల తగ్గలేదు. కొన్ని భయంకరమైన వ్యాధులు దీనివల్ల నివర్తి అవుతున్నాయని తెలుసుకున్నారు. నాటువైద్యులు దీనిని విస్తారంగా వాడేవారు. కురుపులు, పుళ్ళు, కాలిన పుళ్లు, ముఖం మీద వుడువుడు కాయలు, కాళ్లలో ఆని మొదలైన వాటికి రష్యాలో దీని రసాన్ని ఉపయోగించేవారు. గ్రామీణ జీవితంలో దీని ఉపయోగం చాలా ప్రవృద్ధి పొందింది ప్రేగుల సంబంధమైన వివిధ రోగాలకు, జీర్ణశక్తి అభివృద్ధికి, మూలశంకకు, భోజనానికి ముందు తాజా ఉల్లిపాయల రసం ఒక చిన్న చెంచాడు రోజుకు మూడు లేక నాలుగు సార్లు త్రాగేవారు. తీవ్రమైన దగ్గు, ఉబ్బసం, న్యుమోనియా మొదలైన రోగాలకు దీని ఆవిరిని 15 నిమిషాలపాటు లోపలకు పీలిస్తే ఉపశమనం కలుగుతుందని తెలుసుకున్నారు స్త్రీలు సామాన్యంగా ముఖంమీద ముడతలు పోగొట్టుకోడానికి ఉల్లిరసం ముఖానికి రాసుకునేవారు

గాదెలలో గోధుమ, వరి మొదలైన ధాన్యాలు పురుగు పట్టకుండా చాలాకాలం నిల్వఉండడానికి రైతులు ఉల్లిపాయలను మధ్యమధ్య ఉంచేవారు. 1930 లో శాస్త్రజ్ఞులు ఉల్లిపాయలోని పైటాన్సైడ్స్ ఆవిరి రూపంలో సూక్ష్మజీవులను, అనేక ఇతర రోగ క్రిములను అంత్రాక్సు క్షయ, డిఫ్తీరియా మొదలైన రోగాలను కలిగించే సూక్ష్మజీవులను నశింప జేస్తుంద తెలుసుకున్నారు.

ఉల్లిపాయలో ప్రకృతి సిద్ధంగా అనే అమూల్య పదార్థాలు - విటమిను C, కాల్షియం మరియు ఫాస్ఫరస్ లవణాలు, నత్రజని యోగికాలు ఉన్నాయి.

ఉల్లి ద్రావకము లేక కషాయము ఒక మహాద్భుతమైన ఔషధంగా కనుగొనబడింది పూర్వం మానవుల, జంతువుల యొక్క కణజాలంలో మాత్రమే ఉందని తెలుసుకున్న హార్మోన్ ప్రోస్టాగ్లాండిన్ ఉల్లిపాయలో ఉన్నట్టు తెలుసుకున్నారు ఇది ప్రాణులకు మిక్కిలి చైతన్యవంతమైనది. మిక్కిలి తక్కువగా అభివృద్ధి కావింపబడిన ప్రోస్టాగ్లాండిన్‌లు రక్తపు ఒత్తిడిని మరియు రక్తంలో గల అం

## చేపలను పట్టే ఎలుక

పసిఫిక్ మహాసముద్రం పాపువా న్యూగినీ దగ్గర చేపలను పట్టే ఎలుక తన తోకనే ఎరగా ఉపయోగిస్తోంది. చేప తోక పట్టుకున్న వెంటనే తోకను ఎత్తి చేపను పట్టుకుంటుంది.

## జపాను స్త్రీలు దీర్ఘకాలం పాటు జీవిస్తారు

*నగటున జపాను మహిళ 81.39 సంవత్సరాలు జీవిస్తుంది. ప్రపంచంలో ఇది చాలా అధికం టోకియో హెల్త్ అండ్ వెల్‌ఫేర్ మినిస్ట్రీ రిపోర్టు ప్రకారం నగటున 75 61 సంవత్సరాలు జీవించే ఐస్‌లాండ్ పురుషులకంటే జపాను పురుషులు తక్కువ కాలం జీవిస్తారు.*

— 'క్యోడోన్యూస్ సర్వీస్' సౌజన్యంతో

"సకల ప్రాణికోటికి మంచిని కోరడమే మానవీయుల పరమావధి."

భూతాలను క్రమబద్ధంచేసి రక్తాన్ని గడ్డకట్ట నీయక, శ్వేతరక్తకణాల అభివృద్ధి వల్ల సంభ వించే లుకేమియా కలుగకుండా నివా రిస్తుంది.

ఉల్లిరసం కొలస్టరాల్‌ను తొలగించి రక్త ప్రవాహాన్ని శుభ్రపరుస్తుంది అని ప్రయోగ పూర్వకంగా తెలుసుకున్నారు మధుమేహం (డయాబిటిస్)తో భాధపడేవారికి కుమ్ములో కాల్చిన ఉల్లి ఎంతో మేలు చేస్తుంది.

సోవియెట్ ఔషధ శాస్త్రజ్ఞులు ఉల్లి మొక్కల నుండి (ఉల్లికోళ్లు) ఎల్లైల్‌చెప్ (allylchep) అనే ఆల్కహాల్ ద్రావకాన్ని తయారుచేసారు. ఇదిజీర్ణకోశాన్ని ఉత్తేజపరచి, జీర్ణశక్తిని అభివృద్ధిచేసి ఆరోగ్య సౌభాగ్యాన్ని కలిగిస్తుంది. రక్తనాళాలలో క్రొవ్వును చేరనీయదు. రక్తపుపోటును తగ్గిస్తుంది.

ప్రకృతిసిద్ధమైన ఉల్లిపాయను ఉపయో గించడం ఆరోగ్యవంతులకు విటమినులలోపం ఏర్పడకుండా మహోపకారం చేస్తుంది.

ఇతర వస్తువులతో పాటు ఉల్లిచేర్చిన ఆహారపదార్థాలు రుచికరంగా ఉంటాయి. సులభంగా జీర్ణమవుతాయి. మంచి ఆకలి పుట్టిస్తుంది.

—'స్ఫుటనికొ' సౌజన్యంతో

## 10 మిలియను డాలర్లకు కాళ్లను భీమా చేయించుకుంది

హాలివుడ్ సినిమానటి మార్లిన్ డైట్రిచ్ (Marlene Dietrich) అందమైన తన కాళ్లను 10 మిలియను డాలర్లకు భీమా చేయించుకుంది.

## పిల్లలకు ప్రార్థన



ప్రపంచకుటుంబంలో నేనొక సభ్యుడను.

నాతో ఉన్నవారికి నేను బంధువుడనై ఉన్నాను. ఒకే గాలిని పీల్చుకుంటాము. ఒకే వెలుగును పంచుకుంటాము. చిత్రమ ప్రపంచాన్ని ఆశతో పంచుకుంటాము.

నాకు ఇచ్చేందుకు ఒక బాధ్యత ఉంది. గ్రహించగల బాధ్యత ఒకటి ఉంది. దాపరికం లేకుండా నిరాటంకంగా ఎవరి ఇష్టానుసారం వారు నడుచుకునేటట్లుగా స్వాతంత్ర్యంగా ఉండడానికి.

ఇంతకు పూర్వం ఇక్కడ జీవించిన వారిదగ్గర నుంచి ఈ ప్రపంచం పిత్రార్జితంగా లభించింది.

ఏవో కొన్ని సంవత్సరాలపాటు అనుభవిస్తాను ఇకముందు వచ్చే వారికోసం ఈ ప్రపంచాన్ని అతిజాగ్రత్తగా కాపాడతాను.

ఇతరులతోపాటు నా జీవితం శాంతిభద్రతలకే పోరాటానికి కాదు. నిరాశపడిపోవడానికి కాదు. ప్రత్యాశతో దాస్యానికి కాదు - స్వాతంత్ర్యానికి దారి నడుస్తుంది.

నేను నాతో వారితో కలిసి మానవుని సాధుత్వాన్ని చైతన్యవంతం చేస్తాను. మేము అందరం చేరి సామూహికంగా దీనికోసమే ప్రతిజ్ఞచేస్తాం.

— 'యునైటెడ్ నేషన్స్ చిల్డ్రన్స్ ఫండ్ ఇన్ఫర్మేషన్ బులెటిన్' సౌజన్యంతో

"ఖద్దరు ధరించిన మాత్రాన ప్రతీవాడూ గాంధేయుడు కాడు."

— పి. సీతారామరాజు

# వీరిని గురించి తెలుసుకోండి

జస్టిస్ ఇ.ఎస్ వెంకటరామయ్య: భారత దేశపు ప్రధాన న్యాయమూర్తి. నాలుగు దశాబ్దాల పాటు ప్రసిద్ధి కెక్కిన న్యాయవాదిగా పేరు పొందాడు. వీరు ఇప్పుడు మానవహక్కుల (Human Rights) అంతర్జాతీయ సంస్థ చెయిర్మన్ పదవిలో ఉన్నారు.

* * *

శ్రీ ఎస్. మూల్ గోకర్: TELCO "సృష్టికర్త." ప్రజారంగంలో సాలీనా రూ. 1,676 కోట్ల పైబడిన రాబడితో 61,000 వ్యాపార వాహనాలను ఉత్పత్తిచేసే బ్రహ్మాండమైన సంస్థ టెల్కో. 1987లో వీరు ఆటోమొబాయిల్ పరిశ్రమలో ఉత్తమసేవకు ఇండియన్ రోడ్స్ అండ్ ట్రాన్స్‌పోర్ట్ డెవలప్‌మెంట్ అసోసియేషన్ వారి అవార్డును పొందారు.

* * *

అల్ఫ్రెడో డి స్టెఫానో: సుప్రసిద్ధ ఫుట్‌బాల్ ఆటగాడు, అర్జెంటీనా ఇతడి జన్మస్థానం. స్పెయిన్ తరపున కూడా ఆడాడు. స్పెయిన్‌లో రియల్ మాడ్రిడ్‌ను ఓడించి గొప్ప క్రీడాకారుడుగా ప్రకాశించాడు. 1946-1950 సంవత్సరాల మధ్య మొదటి అయిదు యూరోపియన్ కప్పులను గెలుచుకున్నాడు. యూరోపియన్ పందెంలో 49 గోలులు చేసి రికార్డు స్థాపించాడు.

* * *

జో డేవిస్. ఆంగ్లేయ బిలియర్డ్స్ మరియు స్నూకర్ ఆటగాడు. 1927 నుంచి 1946 వరకూ స్నూకర్ ఆటలో ప్రసిద్ధిపొందాడు. 1955వ సం లో అత్యధికంగా 147 పాయింట్లు రికార్డు చేసిన ఘనుడు.

* * *

డేవిడ్ లివింగ్‌స్టన్ (1813-1873): ప్రసిద్ధి పొందిన స్కాటిష్ మిషనరీ వైద్యుడు మరియు క్రొత్త క్రొత్త దేశాలను కనిపెట్టిన గొప్ప సాహసికుడు 1849 లో కల్హారీ ఎడారి ఉత్తర దిక్కుగా నాగామిసరస్సును, 1851లో జాంబెజీ నదిని, 1855లో విక్టోరియా జలపాతాన్ని కనుగొన్నాడు. నైల్ నదీ జన్మస్థానాన్ని ఇంకా వెతుకుతూనే ఇతడు ఆఫ్రికాలో మరణించాడు.

●

## కాఫీ పుష్టికరం!

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ వారి పరిశోధన ప్రకారం పానీయంగా కాఫీ ఏమాత్రం చెడుపు చేయదు. కాఫీలో ముఖ్యంగా విటమిను B 5 చెందిన నియాసిన్ (Niacin) అధికంగా ఉంటుంది. వేయించినప్పుడు ఈ గింజలలో నియాసిన్ బాగా అధికమవుతుంది. సాధారణంగా ఎక్కువగా కాఫీ త్రాగేవారికి పెల్లాగ్రా వంటి చర్మ రోగం అసలు రాదు. నియాసిన్ లోపంవల్లే పెల్లాగ్రా వస్తుంది. పచ్చి కాఫీ గింజలలో 11 శాతం ప్రోటీను, 8 శాతం చక్కెరలు ఉంటాయి.

## హర్స్ట్ ఇంట్లో ప్రతీచోట టెలిఫోను పెట్టించాడు

*అమెరికన్ మిలియనీరు, జర్నలిస్టు, పబ్లిషర్, విలియం రాండాల్ఫ్ హర్స్ట్ (1863-1951) చాదస్తపు మనిషి. ఇతడు ఇంట్లో ప్రతీగదిలో ఒక టెలిఫోను అమర్చుకున్నాడు. ఎవరికీ తెలియకుండా వెళ్లబోదెల్లో కూడా అమర్చాడు.*

"అనుకున్నది జరుగదు. మనకున్నది తప్పదు. జరిగిన దానికి తృప్తిపడండి. జరగనిదానికి చింతపడవద్దు." — అమ్మ

# లావు తగ్గాలంటే?

ప్రకృతిసిద్ధంగా లభించే తేనె మన ఆహారంలో ఉండేలోపాలను అన్నిటినీ భర్తీ చేయడమే గాక దివ్యమైన ఔషధంగా కూడ పనిచేస్తుంది. తేనెలో సోడియం, పొటాషియం, కాల్షియం, మెగ్నీషియం, ఇనుము వంటి అమూల్యమైన లోహాలేగాక, B గ్రూపుకు చెందిన విటమినులు, కొంతవరకు C విటమిను కూడా ఉంటాయి.



అనేక శతాబ్దాల నుంచి వివిధ దేశాలలో తేనె ఒక అద్భుతమైన ఆహారంగా పరిగణించబడుతూంది ప్రాచీనగ్రీసులో ఒలింపిక్ క్రీడలకు శిక్షణ పొందే సమయంలో క్రీడాకారులు ఎక్కువగా తేనెను తీసుకునే వారు. నేటికీ పర్వతారోహకులు, ఈతగాళ్లు సహనశక్తిని, సామర్థ్యాన్ని అభివృద్ధి చేసుకోవడానికి తేనెను ఔషధంగా ఉపయోగిస్తారు.

సక్రమంగా తేనె ఇస్తే చిన్నపిల్లలు రక్తపుష్టి కలిగి శారీరక భారం, సామర్థ్యం వృద్ధి పొంది మంచిరూపంతో నవనవలాడుతూంటారు. మూడు టీస్పూనుల తేనె ఒక పెద్దగ్రుడ్డు ఇచ్చేపుష్టిని ఇస్తుందని శాస్త్రజ్ఞులు నిరూపించారు.

తేనె యొక్క రోగనివారక గుణాలను మొట్ట మొదట వైద్యపితామహుడు ఈస్కూలాపి

## భవిష్యత్తులో ఆశింపబడుతున్నాయి

* రసాయనిక సంయోగంతో అధికవ్యయం లేకుండా పుష్టికరమైన ఆహారం, కాన్సర్ నిర్మూలన - 1990
* సర్వసాధారణంగా వెన్నెముక, మెదడు ట్రాన్స్‌ప్లాంట్స్ - 1995
* శరీరంలో అన్నిభాగాలు ట్రాన్స్‌ప్లాంటేషన్ 2000
* వృద్ధాప్యాన్ని అరికట్టడం - 2005
* కొన్ని అవయవాలు అంగాలు పెరుగుదలకు బయోకెమికల్స్ - 2007
* అనువంశికంగా విశిష్టకరమైన సంతానోత్పత్తికి విస్తృత కృత్రిమ గర్భవిధానం - 2010
* విజ్ఞానాభివృద్ధికి ఔషధాలు - 2012
* కృత్రిమ గర్భకోశాలలో పిండాభివృద్ధి - 2015
* మానవుని బుద్ధికుశలతను అభివృద్ధి పరచడానికి మానవుని మెదడు కంప్యూటర్‌తో జతపర్చడం - 2020
* మానవుని పుట్టుక అనువంశికము సంపూర్ణాధ్యయనం - 2030
* జీవచైతన్యత విలువ్రుదల - 2040
* వయస్సు నియంత్రణ, మానవకృతమైన అమరత్వం - 2050

— బిపోస్ట్ - ఫిజీషియన్ ఇరా, 21వ శతాబ్దంలో వైద్యం, జెర్రోల్డ్ మాక్స్‌మెన్

"అహంకార మమకారములను విడువగలవాడె శాంతిని బడయగలడు."

యస్ (Aesculapius) కనుగొన్నాడు. ఈనాడు శస్త్రవైద్యులు శస్త్రచికిత్సానంతరం చికిత్సకు తేనెను ఉపయోగిస్తున్నారు. తేనేమందుతో కట్లు కట్టితే పుళ్లు శీఘ్రంగా మానతాయి పుళ్లలోగల తేమను తేనెహరించేస్తుంది అందుచేత తేమలేని పొడి వాతావరణంలో సూక్ష్మజీవులు సులభంగా నశించిపోతాయి తేనె ఊపిరితిత్తులకు, మూత్రపిండాలకు, చర్మానికి ఆరోగ్యాన్ని కలిగిస్తుంది.

దానిమ్మగింజల రసంలో ఒక చిన్న చెంచాడు తేనె కలిపి త్రాగండి. చలిజ్వరం, ఫ్లూజ్వరం వెంటనే తగ్గిపోతాయి. శరీరం లావెక్కి పోయి భారీ కాయంతో మీరు ఇబ్బందులు పడుతు న్నారా? భాయపడకండి. భారీగా పెరిగిన శరీరాన్ని సులభంగా తగ్గించుకోవచ్చు. ప్రతీ రోజూ ఉదయం. పరగడుపున తాజానిమ్మ పండు రసంలో మూడు చిన్న చెంచాల తేనె కలుపు కుని కొద్దిరోజులపాటు త్రాగండి.

సన్నగా ఈదురోమంటూ పూచిక పుల్లలా ఉండేవాళ్లు కండపుష్టితో తాజాగా ఉండాలను కుంటే రోజూ రాత్రి పడుకునే ముందు ఒకకప్పు నులి వెచ్చని పాలలో ఒకపెద్ద చెంచాడు తేనె కలిపి త్రాగుతూండండి. నెలరోజుల తరువాత అద్దంలో చూచుకొండి. మీకే ఆశ్చర్యంగా ఉంటుంది.

చలికాలంలో గొంతునొప్పి సాధారణంగా అందరికీ వస్తుంది. వెంటనే ఒక చెంచాడు తేనె కొద్దికొద్దిగా చప్పరించండి. గొంతునొప్పి మటుమాయమైపోతుంది. ఊపిరి తిరగ కుండా విపరీతమైన దగ్గుతో క్రుంగిపోతూంటే బాగా మగ్గిన వెలగపండు గుజ్జుతేనెలో కలుపు కుని కొద్దిరోజులపాటు రాత్రిళ్లు పడుకునే ముందు తినండి. ఏ కాఫ్‌సిరప్‌లు

(మిగతా 79 వ పేజీలో)

## మూడు ఆదర్శాలు



ప్రపంచ ప్రఖ్యాతిపొందిన కెనేడియన్-అమెరికన్ వైద్యుడు మరియు ప్రసిద్ధ రచయిత సర్ విలియమ్ ఆస్లర్ *(1849-1919)* కొందరు వైద్య విద్యార్థులకు ప్రసంగిస్తూ భవిష్యత్తులో వారి వైద్య వృత్తికి సహకరించడానికి మూడు ముఖ్యమైన విషయాలు చెప్పాడు. ఇవి తన ఆదర్శాలుగా వివరించాడు.

నాకు ముఖ్యంగా మూడు ఆదర్శాలు ఉన్నాయి. మొదటిది. ఈ రోజు చేయవలసిన పని పూర్తిగా రేపటి దానికోసం ఆరాటపడకుండా పూర్తి చేస్తాను. దీనిని నిర్విఘ్నంగా కొనసాగించడానికి ఆ రోజు చేయవలసిన పనిని నిర్ణయించుకుని సాధ్యమైనంత వరకు దాని ప్రకారం నిర్వర్తిస్తాను. భవిష్యత్తును గురించి ఆలోచించను.

రెండవ ఆదర్శము వైద్యధర్మాన్ని అనుసరించడం. వైద్యవృత్తిని అవలంబించే సోదర వైద్యులపట్ల, రోగులపట్ల గౌరవంతో ప్రవర్తిస్తాను.

మూడవది. విజయాన్ని అతి వినయంతో, నిగర్వంగానూ, శాంతంగానూ అంగీకరిస్తాను. స్నేహితుల వాత్సల్యానికి గర్వ పడతాను. కష్టాలు సంభవించినప్పుడు ధైర్యంగా ఎదుర్కొంటాను.

-ఇన్‌స్పిరేషనల్ కోట్ సౌజన్యంతో

# నవ్యకల్పనాచతురులు

## జి.డి.నాయుడు

జి.డి.నాయుడు దక్షిణ భారతదేశంలో నవ్యకల్పనా చతురుడు, గొప్ప పారిశ్రామిక వేత్త, దేశాభిమాని. ఇతడు బాల్యంలో ఒక చిన్న గ్రామంలో ప్రాథమిక పాఠశాలలో మూడు సంవత్సరాలపాటు తమిళభాష నేర్చుకున్నాడు. తరువాత పాఠశాల వదలి తమిళ నాడులో మూడవ పెద్ద నగరమైన కోయంబత్తూరు దగ్గర కలంగల్ అనే చిన్న గ్రామంలో



G.D. NAIDU

తంత్రీపాలంలో పని చేస్తూండేవాడు. ప్రశాంత గ్రామీణ జీవితంలో పెరిగాడు. ప్రతిదినం తమిళగ్రంథాలు చదువుతూండేవాడు. జీవితపు వివిధరంగాలలో స్వంతంగా ప్రయత్నించి జ్ఞానం సంపాదించుకున్నాడు.

జి.డి.నాయుడు 20వ సం.రం. వయస్సులో తన గ్రామాన్ని వదిలి కోయంబత్తూరు వచ్చి చేరాడు. మూడు సంవత్సరాల పాటు నెలకు మూడు రూపాయల జీతం మీద ఉచితభోజన సదుపాయంతో హోటలులో ఒక అసిస్టెంటుగా చేరాడు. కూడబెట్టిన సొమ్ముతో లంకాషైర్ అనే ఒక ఆంగ్లేయుని దగ్గర మోటారు సైకిల్ కొన్నాడు ఆమోటారు సైకిల్ మెషీన్‌లో మరలు విప్పి తిరిగి బిగించి మోటారు సైకిల్ నిర్మాణం, దాని యాంత్రిక విధానం పూర్తిగా తనంతటతానే స్వంతంగా నేర్చుకున్నాడు. తిరుప్పూర్‌లో స్వంతంగా నూలు మిల్లు స్థాపించాడు. మొదటి ప్రపంచ మహాయుద్ధం ప్రారంభమైంది. ఇతడి వ్యాపారం బాగా వృద్ధి పొందింది. కోయంబత్తూరులో మంచిపేరు, గౌరవం సంపాదించాడు.

రెండు మూడు ఏళ్లలో ఒక సుప్రసిద్ధ ఇంగ్లీషు వ్యాపారస్థుడు రాబర్ట్ స్టేన్స్ సలహాతో జి.డి.నాయుడు ఆటోమొబయిల్ వ్యాపారం ప్రారంభించాడు. 1920లో జి.డి.నాయుడు పొళ్లాచ్చి మరియు పళని మధ్య సుమారు 40 మైళ్ల దూరం స్వంతంగా పాసింజరు బస్ సర్వీసు ప్రారంభించి తానే నడపడం మొదలుపెట్టాడు.20 ఏళ్లలో దక్షిణదేశంలో పబ్లిక్ ట్రాన్సుపోర్టు సర్వీసు అతిసామర్థ్య వంతంగా నిర్వహించాడు. ఇతడి బస్సులు మద్రాసు రాజధానిలోను, మరియు కొచ్చిన్ స్టేటులోను కోయంబత్తూరు, నీలగిరి, మధురై, మలబారు (ఇప్పుడు కేరళలో ఒక భాగం) జిల్లాలలో అన్ని రోడ్లమీద తిరగడం ప్రారంభించాయి. సుమారు 200కి పైబడిన ఇతడి వాహనాలు మొత్తం 1,500 మైళ్లు తిరిగేవి ఇతడి ట్రాన్స్‌పోర్ట్ వ్యాపారంలో సామర్థ్యత అనేదే ముఖ్య లక్షణం.

"ఈశ్వరుని సృష్టిలో చెడు అనేది లేదు. అది మన దృష్టిలోపంవల్ల అలా కనిపిస్తుంది, అనిపిస్తుంది."

బాగ్దాద్‌కాలీఫ్ అయిన హరున్-అల్ రషీద్ లాగా మారువేషంలో బయలుదేరి బస్సు సిబ్బంది ప్రయాణీకులతో ఎలా నడుచు కుంటున్నారో రహస్యంగా తెలుసుకునేవాడు ఇతని దగ్గర ఇతని సంస్థలలో పనిచేసేవారికి నిష్కాపట్యం, నిజాయితీ, మర్యాద, చేసే ఉద్యోగంలో గౌరవం, భక్తిఉండాలని ఉద్యోగ ధర్మంగా నియమించాడు. గొప్ప అమెరికన్ పారిశ్రామికవేత్త హెన్రీఫోర్డ్‌లాగా తన సంస్థలో పనిచేసే ఉద్యోగస్థుల పేరు, ఊరు, వారి స్వభావం, గుణం, వాళ్ల అభిరుచులు, వారి జీవిత విధానాలు, కష్టాలు, నష్టాలు అన్నీ వివరంగా తెలుసుకునేవాడు.

ఎన్ని పనులలో ఉన్నా తీరిక లేకపోయినా పెద్ద, చిన్న అనే భేదం లేకుండా ఏ రహస్యం దాచకుండా అందరితో సమానంగా మాట్లాడేవాడు. అతడు స్థాపించిన రేడియో ఫాక్టరీలో 1951 లోనే అందరికీ ఆశ్చర్యం కలిగించేటట్టుగా ఒక మహిళా ఇంజనీరుని నియమించాడు. కోయంబత్తూరు దగ్గరగా పల్లడంలో ప్రయాణీకుల సౌకర్యార్థం భారతదేశంలో మిక్కిలి బ్రహ్మాండమైన బస్‌స్టేషన్‌ని నిర్మించాడు. ఏ కాలేజీ విద్య, శిక్షణ, తర్ఫీదు లేకుండా అపూర్వమైన నవ్యకల్పనా చతురుడై సాటిలేని ప్రతిభాశాలిగా పేరుపొందాడు. ఏ మెషీనులలోనైనా ఏర్పడే సమస్యలను గంటల తరబడి స్వంతంగా ఆలోచించి సాధించేవాడు.

జి.డి.నాయుడు అభివృద్ధి చేసిన ఒక క్రొత్త ఎలక్ట్రిక్ రేజర్ ఒక్క భారతదేశంలో తప్ప అన్ని విదేశాలలోను ప్రసిద్ధిపొందింది! 'రాసాంట్' (Rasant) అని చెప్పబడే ఇతడు కల్పించిన ఎలక్ట్రిక్ రేజర్ ఇంగ్లండులో మిక్కిలి ప్రసిద్ధిపొందింది. అతడు తయారు చేసిన బ్లేడు అంతవరకు ప్రపంచంలో ఎవ్వరూ రూపొందించని అతి పల్చని బ్లేడు-అంగుళంలో 1/200 వంతు దళసరిగా ఉండేది. ఈ రాసాంట్ బ్లేడు సులభంగా 200 షేవులను ఇచ్చేది.

ఇతడు కనిపెట్టినవాటిలో ముఖ్యంగా ఎన్నికలలో ఏ అక్రమానికి వీలులేకుండా ఉపయోగించడానికి వోటు రికార్డింగ్ మెషీను, మోటారు కారులో నీళ్లువేయకుండా కొన్ని వందల మైళ్ళు తిరగడానికి వీలుగా ఆటోరేడియేటరు, వైబ్రేటర్ టెస్టింగ్ మెషీన్, సేఫ్టీరేజర్ బ్లేడుల తయారీకి ప్రత్యేకమైన మెషీను, ఫిల్ము కెమెరాలకు డిస్టెన్స్ సరిచేసే విధానం, ప్రత్యేకంగా రూపొందించబడిన ఫ్రూట్‌జ్యూస్ తయారు చేసేయంత్రం, ఇంకా స్వంతంగా డిజైనుచేసిన అనేక క్రొత్త క్రొత్త కల్పనలు.

జి.డి.నాయుడికి ఒక అపూర్వమైన సృజన శక్తి ఉండేది. సదా ఏదో ఒక క్రొత్త వస్తువును కనిపెడుతూండేవాడు కోయంబత్తూరులో ఏర్పరచిన వర్క్‌షాప్‌లోను, టెక్నికల్ మ్యూజియంలోను అతడు నిర్మించిన వస్తువులను చూచి అందరూ మిక్కిలి ఆశ్చర్యపడిపోతూండేవారు. అనేక మందికి తగిన శిక్షణ తర్ఫీదు ఇచ్చి ఒక కొత్తరకం ఇంజనీరుల బృందాన్ని తయారు చేసాడు. కోయంబత్తూరు దగ్గర

(మిగతా 76 వ పేజీలో)

గ్రంథాలు - గ్రంథకర్తలు

ద త్రీ మస్కటీర్స్ : అలెగ్జాండర్ డ్యూమాస్ పెరె
వానిటీ ఫెయిర్ : విలియం థాకరే
నైన్టీన్ ఎయిటీఫోర్ : జార్జ్ ఆర్వెల్
ద లాస్ట్ వరల్డ్ : ఆర్థర్ కానన్ డాయిల్
గాన్ విత్ ద విండ్ : మార్గరెట్ మిచ్చెల్

"జీవితాన్ని ఉపాసనగా మార్చుకోవడమే మోక్షానికి రాజబాట."

# విషకరమైన పాములలో 'రాజనాగము' మిక్కిలి పెద్దది

రాజనాగము (నాగుపాము) మిక్కిలి విషకర మైనది. దీని నోటిలో పై కోరలలో తీవ్రమైన విషం ఉంటుంది బాగా పెద్దదిగా పెరిగిన నాగుపాము 180సెం.మీ.ల పొడవు, 15సెం.మీల లావుగా ఉంటుంది ఇది కంఠంలో ప్రక్క ఎముకలను విస్తరింపజేసినప్పుడు కంఠం చుట్టూ ఉండే వదులుపాటి చర్మము ముందుకుసాగి పడగగా ఏర్పడుతుంది. ఇదే మామూలు పాములకు నాగుపాము



లకు గల భేదము. మొట్టమొదట పోర్చుగీసువారు దానికి కోబ్రా-డి-కాపెల్లో (Cobra-de-Capello) అని పేరు పెట్టారు పడగ గల పాము అని దీనికి అర్థము

భారతదేశపు త్రాచు లేక నాగుపాము 25 సంవత్సరాల కంటే అధిక కాలం జీవించదు దీని కడుపులో జఠరరసం, వెంట్రుకలు, చర్మం, ఎముకలుతో కూడిన పూర్తి జంతువును జీర్ణింపచేయడానికి సహకరిస్తుంది ఇది దీర్ఘకాలం పాటు ఆహారం లేకుండా జీవించగలదు ఇతర పాములకు వలె నాగుపాము కండ్లకు పైరెప్పలు ఉండవు కాబట్టి కళ్లు ఎప్పుడూ తెరుచుకునే ఉంటాయి దీనికి శ్రవణేంద్రియాలు కూడా ఉండవు

భారతదేశపు నాగుపాము కొట్టి కరుస్తుంది. అప్పుడప్పుడు అరుదుగా గురి చూసి విషాన్ని కక్కుతుంది రాజనాగము అని చెప్పబడే నాగుపాము విషపు పాములలో మిక్కిలి పెద్దది ఇది చాలా అరుదుగా మనుష్యుల మీద పడుతుంది సాధారణంగా ఇది 5 50 మీటర్ల పొడవుగా ఉంటుంది చిన్న చిన్న పాములను ఆహారంగా తింటుంది రాజనాగానికి సుమారు పది మనుష్యులను కుట్టి చంపడానికి తగినంత విషం ఉంటుంది.

( 75 వ పేజీ తరువాయి)

పొదనూరు గ్రామంలో 40 ఎకరాల అందమైన తోటలో ఇతడి వ్యవసాయ పరిశోధనలకు ఎంతో మంది ఆశ్చర్యపడిపోయారు. పెకింగ్‌లో సిస్టమెటిక్ బాటనీ ఇన్‌స్టిట్యూట్‌లో ఆవరణ (Ecology) శాస్త్రజ్ఞుడు డా కి సోహ్-యో-హెూన్ అనే చైనా పరిశోధకుడు ఇది చూచి ప్రపంచంలో మరెక్కడాలేని ప్రసిద్ధిపొందిన భారతీయ నవ్యకల్పనా చతురుని వద్ద శిష్యరికం చేయడానికి కుతూహలపడుతున్నానని చెప్పాడు

భారతదేశంలో ఒక్కడే ఒక్క జి డి నాయుడు. ఇటువంటి ప్రతిభాశాలి, నవ్యకల్పనా చతురుడు మరియొకడు పుట్టడానికి వేచి ఉండాలి. ఇతడి అపూర్వ సామర్థ్యం, విజ్ఞానంతో భారతదేశపు సాంకేతిక సామ్రాజ్య నిర్మాణం జరగ లేదనేది విచారించవలసిన విషయం కారణ జన్ముడు జి.డి నాయుడు 'మిలియను మందిలో ఒకడు' అని భారతదేశపు విజ్ఞాన వేత్త భారతరత్న ప్రొ.సి.వి.రామన్ కొన్ని ఏళ్ల క్రితం కోయంబత్తూరు సందర్శించినప్పుడు చెప్పినమాట జి డి నాయుడు 1974 జనవరిలో మరణించాడు

"ఏది సంభవించినా సమచిత్తముతో స్వీకరించుటే సంపూర్ణ శరణాగతి."

# ఎవరి ధర్మం వారు ఆచరించాలి

## శ్రీ జయేంద్ర సరస్వతి స్వామిగళ్

భగవద్గీతలో శ్రీ కృష్ణుడు చెప్పినది: మానవుడు శాస్త్రోదితమైన ధర్మాలను ఆచరించుట ద్వారా సిద్ధిని పొందుతాడు ఒక కుటుంబంలో యజమాని తండ్రి, తండ్రిగా తానుచేయవలసిన కర్మలను తండ్రి ఆచరించి తీరాలి. తల్లిగా నిర్వర్తించవలసిన ధర్మాలను తల్లి నిర్వర్తించాలి శిష్యుడు శిష్య



ధర్మాన్ని ఆచరించాలి. గురువు తన ధర్మాన్ని తాను ఆచరించాలి. ఈవిధంగా ఎవరిధర్మం వారు ఆచరిస్తే భగవదనుగ్రహం పొందగలుగుతారు. విధ్యుక్తధర్మాన్ని మరచి పోయిన వారే దేవాలయాలను సందర్శించి దేవుళ్లను పూజిస్తారు. పూజ్యులైన తన తలిదండ్రులకు సేవచేస్తూంటే చాలు భార్య తన భర్తకు సేవ చేస్తూంటే చాలు. గుడిలో దేవుణ్ణి పూజించినంత ఫలం లభిస్తుంది

ఈ భావాన్ని వివరించడానికి మహాభారతంలో ఒక చిన్న కథ ఉంది. ఒక ఇంట్లో ఒక పిల్లవాడు తన తలిదండ్రులకు సేవచేయడం మాని అడవులకు వెళ్లిపోయాడు. ఈ బాలుడు తన ధర్మాన్ని మరచిపోయాడు. అడవిలో కొందరు మునులు ఈ బాలుడికి మంత్రోపదేశం చేసారు మంత్రోపదేశం పొందిన బాలుడు ఒక చెట్టుక్రింద కూర్చుని పదిరోజులపాటు దీక్షతో జపంచేసాడు. ఈ విధంగా జపంచేసిన తరువాత తనకేదో అపూర్వమైన మహిమలు, శక్తులు లభించాయి అని అనుకున్నాడు.

చెట్టుక్రింద తపస్సుచేసుకుంటూంటే ఆ చెట్టు మీద ఉన్న కొంగ అతడి తలమీద రెట్టవేసింది. వెంటనే ఆ బాలుడు కోపంతో ఆ కొంగను చూసాడు. తపోమహిమతో ఆ కొంగ కాలి భస్మమై క్రిందపడింది.

ఈ గొప్ప మహిమతో ప్రపంచాన్నంతా గజగజలాడించేయవచ్చు అని అనుకున్నాడు. ఆకలి వేసినప్పుడు అన్నీ మరచిపోతారు. అడవి వదలి ప్రక్కన ఉన్న గ్రామంలో ఒక ఇంటికి వెళ్లి ఆ ఇంటి యజమానురాలిని ఆకలికి పట్టెడన్నం పెట్టమని అడిగాడు ఇంట్లో ఆవిడ మాట్లాడకుండా తనవనులు చేసుకుంటూంది. ఆవిడను కోపంగా చూడడం

### జనాభా లెక్క సామాన్యంకాదు

'సెన్సెస్' అంటే జనాభా లెక్క-సామాన్యంకాదు. ఇది భారతదేశంలో బ్రహ్మాండమైనది. 1991లో అంచనా వేసుకున్న 837 మిలియను జనాభా కట్టడానికే వ్యక్తికి ఒక రూపాయి చొప్పున ఖర్చు అవుతుంది.

"నేను, నాది అనేభావం వ్యక్తిని వివేక శూన్యుని చేస్తుంది."

ప్రారంభించాడు. ఆ ఇంట్లో ఆవిడకూడా అతనివైపు చూసి 'ఏంచెట్టుమీద కూర్చున్న కొంగని అనుకున్నావా, నన్ను భస్మంచేయ డానికి' అని అడిగింది.

బాలుడికి ఆశ్చర్యం వేసింది ఎక్కడో అడవిలో మరణించిన కొంగను గురించి ఈమెకు ఎలా తెలుసు అనుకుని కొంగను భస్మంచేసానని నీకెలా తెలుసు అని అడిగాడు. 'అవన్నీ చెప్పడానికి ఇప్పుడు నాకు అవకాశం లేదు. నా ఇంట్లోపనులు ముగించుకోవాలి. వీధి చివర ఒక కసాయివాడు ఉన్నాడు అతణ్ణి అడుగు చెబుతాడు' అంది.

బాలుడు వెంటనే ఆమెచెప్పినట్లు కసాయి వాడి దగ్గరకు వెళ్లాడు. కసాయివాడు 'ఆ ఇంటి ఆమె నిన్ను నాదగ్గరకు పంపిందా?' అని అడిగాడు. బాలుడికి మరింత ఆశ్చర్యం వేసింది. కసాయివాడికీ రహస్యం ఎలా తెలి సిందో చెప్పమన్నాడు. 'ఇప్పుడు చెప్పడానికి నాకు అవకాశం లేదు కొంతసేపు ఉండు' అన్నాడు కసాయివాడు. బాలుడు తిరిగి తిరిగి అడిగాడు. కసాయివాడు చెప్పడం ప్రారంభించాడు.

'నీవు వెళ్లి అన్నం అడిగినప్పుడు ఆ ఇంట్లో ఆవిడ భర్తకు అన్నం పెడుతూంది. భర్తకు సేవలు చేస్తూన్న ఆమెకు భగవంతుని అనుగ్రహం దొరికింది. దానిఫలితంగా జరిగినవి, జరుగు తున్నవి, జరుగబోయేవి అన్ని విషయాలు తెలుసుకోగల శక్తి లభించింది. భగవంతుని అనుగ్రహం పొందడానికి ఆమె ఏ తపస్సు చేయలేదు. ఏ దేవాలయం దర్శించలేదు. అని చెబుతూ 'నీవు ఎవ్వరికైనా ఏదైనా సేవ చేసావా? నీ తలిదండ్రులకు సేవచేసావా? నా తలిదండ్రుల సేవేనాకు ముఖ్యం. అస్తమానం వారినే స్మరిస్తూంటాను. నేను కసాయివాడిని అనే సంగతి మరచిపోతాను. నాధర్మం నేను చేసుకుంటాను నువ్వు జీవితంలో ముఖ్యమైన అసలు విషయం మరచిపోయావు. అందు చేత ఈ సూక్ష్మాలు నీకు తెలియవు. నీ మంత్రం నీకు పని చేయదు ఎన్నెన్నో మంత్రా లు బెణుకులకు, తేలుకాటుకి, పాము కాటుకి ఉన్నాయి. నీ మంత్రాలు కూడా అటు వంటి మంత్రాలే' అన్నాడు.

జీవితంలో ఎవరి ధర్మంవారు చేయడం ఎంతోముఖ్యం. భార్యభర్తకు చేయవలసిన ధర్మం, కుమారుడు తలిదండ్రులకు చేయ వలసిన ధర్మం, ఎవరి ధర్మాలు వారికి ఉన్నా యి. జీవితంలో సుఖం, సంతోషం, ఆనందంపొందాలంటే ఎవరి ధర్మం వారు అనుసరించాలి. శాస్త్రాలలో మనం ఏఏ ధర్మాలు ఆచరిస్తే ఏఏ ఫలితాలు పొందుతామో వివరించబడ్డాయి.

## ఏది నిజమైన సన్యాసం?

"సన్యసించవలసింది మానసికంగా గాని, శారీరకంగా కాదు. సుప్రసిద్ధులైన యాజ్ఞవల్క్య మహర్షి, జనక చక్రవర్తి గృహస్థులే కదా. మీరు గృహస్థులుగా ఉన్నా లేక గృహస్థ జీవితం విడిచి అరణ్యానికి వెళ్ళినా, అది మీ మనస్సుపైన ఆధారపడి వుంటుంది. అహంకారం (ego) ఆలోచనకు మూలం. అది శరీరాన్ని, ప్రపంచాన్ని సృష్టించి మీరు గృహస్థులనే భావం కలిగిస్తుంది. 'గృహస్థులం' అనే ఆలోచన విడిచి గృహంలో అరణ్య వాతావరణం ప్రవేశిస్తుంది. మానసిక అడ్డంకులు మీకు ఎప్పుడూ ఉంటాయి. వాటిని మీరు యింట్లో వున్నా అరణ్యంలో వున్నా జయించాలి. వాటిని మీరు అరణ్యంలో జయించగలిగితే యింటివద్ద ఎందుకు జయించలేరు? ఎటువంటి వాతావరణంలో అయినా ప్రయత్నిస్తే సాధించగలరు."

"ఉపాసనవల్ల హృదయం నిష్కళంకం అవుతుంది."

# విజ్ఞాన దీపిక

## 100 పిడుగుల మెరుపు ప్రతి సెకండు భూమిని తాకుతుంది

100 పిడుగుల మెరుపు ప్రతిసెకండు భూమిని తాకుతుంది పిడుగు ఉష్ణోగ్రత 50.000 డిగ్రీల ఫారన్‌హీట్ వరకు ఉంటుంది. ఒక్కొక్క పిడుగు 1,00,000


LIGHTNING

ఆంపియర్ల వరకు విద్యుత్తును జనింప జేస్తుంది న్యూమెక్సికో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మైనింగ్ అండ్ టెక్నాలజీలో డా. క్రెయిగ్ హెయెన్‌గా అధునాతనమైన సాధనాలతో పిడుగులు జనింపజేసే రేడియో తరంగాల పటాలను సృష్టిస్తున్నాడు.

## 'Granite' పద ఉత్పత్తి

'Granite' అనే పదం లాటిన్ 'Granum' లేక 'Grain' నుంచి ఏర్పడింది. దీంట్లో ఫెల్డ్‌స్పార్, క్వార్ట్జ్, మైకా ఉంటాయి ఇది చాలా గట్టిగా ఉంటుంది దీనిని పెద్దపెద్ద నిర్మాణాలకు, సమాధులకు ఉపయోగిస్తారు.

## ఎగిరేచేప

నీటి ఉపరితలంమీద ఎగురుతూన్నట్లు కనిపించే వేడినీటి చేప ఎగిరే చేప (Flying Fish). ఇది గాలిలో గంటకు 16 కి.మీల


FLYING FISH

వేగంతో ఎగురుతుంది. దీని తోక నీరు తగల కుండా ముందుకు దూసుకుపోగలంత బలిష్టంగా ఉంటుంది. 152 మీటర్ల దాకా

(మిగతా 80 వ పేజీలో)

( 73 వ పేజీ తరువాయి)

దీనిముందు పనికిరావు. ప్రతిరోజు ఉదయం పరగడుపున శుభ్రమైన మంచినీటిలో కొద్దిగా తేనె కలుపుకుని త్రాగండి. రోజంతా ఉత్సాహంగా, తాజాగా ఉంటారు. ఇంతమంచి తేనెను ఉపయోగించేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి తెలియకుండా తేనెచేయి తలవెంట్రుకలకు తగిలిందా ముసలితనం రాకుండానే తల ముగ్గుబుట్ట అయిపోతుంది !

"కల నిజం కాదు, కణితి దిండు కాదు."

# క్రికెట్‌ను గురించి కొన్ని విషయాలు

## ఇండియాకు పోటీగా మొట్టమొదటి వెస్ట్ ఇండీస్ టెస్ట్ మాచ్

*వెస్ట్ఇండీస్-ఇండియా మొట్టమొదటి టెస్ట్‌మాచ్‌లో వెస్ట్ ఇండీస్ టీముకు జె డి గొడార్డ్ కాప్టెన్‌గాను, ఇండియా టీముకు లాలాఅమరనాథ్ కాప్టెన్‌గాను ఢిల్లీలో 1948 లో ఫెరోజ్‌షాకోట్లాలో జరిగింది.*



## ఇండియన్ టీమును నడిపించిన నలుగురు యోధులు

*1958-59లో వెస్ట్ ఇండీస్-ఇండియా మధ్య జరిగిన టెస్ట్‌లలో ఇండియన్ టీముకు కాప్టెనుగా నలుగురు ఉన్నారు పాలీ ఉమ్రీగర్ (మొదటి టెస్ట్) గులామ్ అహమద్ (రెండవ మరియు మూడవ టెస్ట్) వినూ మన్‌కాడ్ (నాల్గవ టెస్ట్) హేము అధికారి (అయిదవ టెస్ట్)*

## వెస్ట్ ఇండీస్‌తో గెలిచిన భారత దేశపు మొదటి టెస్ట్

*వెస్ట్ఇండీస్‌తో భారతదేశం గెలిచిన మొట్టమొదటి టెస్ట్ 1971 లో జరిగింది పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లో నిర్వహింపబడిన రెండవ టెస్ట్‌లో ఇండియా గెలిచింది దిలీప్ సర్‌దేశాయి ఇండియాకి ఆడి సెంచరీ చేసాడు* ●

( 79 వ పేజీ తరువాయి)

ఇవి ఎగరడం రికార్డు చేయబడింది సుమారు 100 రకాల చేపలు ఎగురగలవు ఇవి 15-48 సెం.మీ పొడవు ఉంటాయి ఇవి సాధారణంగా వేడినీటి సముద్రాలలో కనిపిస్తాయి

## బాల్సా-అతి మృదువైన మరియు తేలికైన కర్ర

ప్రపంచంలో మిక్కిలి మృదువైన, తేలికైన కర్ర బాల్సా కార్కు అంతబరువు మాత్రమే ఉంటుంది అనేకవేల సంవత్సరాలపాటు బాల్సారాఫ్టులు (నీటిపై తేలే ప్లాట్‌ఫారం) కట్టడానికి ఉపయోగించేవారు దక్షిణ అమెరికాలో బాల్సా వృక్షం అతి శీఘ్రంగా 7 సంవత్సరాలలో 70 అడుగులు ఎత్తు పెరుగుతుంది.

## ప్రపంచంలో 50 శాతం కోబాల్టు జెయ్‌రే నుంచి వస్తుంది

హైస్పీడు కట్టింగ్ టూల్స్ మరియు జెట్ ఇంజన్లు తయారుచేయడానికి లోహపు మిశ్రమంలో (Alloy) ఉపయోగించే తెల్లని ఖనిజము కోబాల్టు. ప్రపంచంలో 50 శాతం కోబాల్టు ఆఫ్రికా జెయ్‌రేనుంచి వస్తుంది. కెనడా మరియు జాంబియా (తూర్పు ఆఫ్రికా) కూడా కోబాల్టును అధికంగా ఉత్పత్తిచేస్తాయి ●

"కల్తీ విత్తనాలు వేస్తే గాదెలు వెర్రి,ఎన్నటికీ పూడదు."

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT

*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084,*

